# INTRODUCTION

There are hardly two or three books on methods of teaching Telugu. One need not apologize to add to such a small number.

As the mother tongue gains its proper place, both in the school and society, the responsibility of its teacher increases. The days when the knowledge of the language alone was considered sufficient to make a language-teacher, are gone for good; method has come to stay.

A teacher who gains a grasp of methodical teaching realizes that it is both effective and economical, from the point of view of himself as well as the child.

Throughout this little volume my one endeavour has been to give the teacher an insight into the problems of the subject, so that he may visualize for himself their difficulties and react to them as he thinks proper. Therefore stimulation rather than spoon-feeding has been the aim. The teacher who takes up the book only for the sake of the training examinations, may be disappointed that points are not listed to facilitate memorization for the occasion and forget soon. The questions also are so framed that they lead the reader to the very heart of discussion rather than simply help him to locate pages in the text as answers; in a good many cases questions call for the teacher's own experience and effort, without a trace of ready matter in the book. That is why they are called matters for observation instead of questions.

As the book ranges over the entire field in broad outlines, it will naturally cover any reasonable syllabus in the subject; only the order of items will differ.

Technical books in the regional languages often read lame because of tame touches of translation. One may not find that defect here, as I have been content to place the subject before the reader in a straight way. Even to reinforce my views, no padding quotations have been leaned upon. On the other hand, in the matters for observation, quotations from this book are frequently given, with a view to throw the problems into clear relief.

A brief list of technical terms is added, because this item is yet fluid in our languages; and quite a few of them are my own inventions.

I am much beholden to all my old students of different classes, from M. T. C. to B. Ed., who have shaped my thought on the subject, by their discussions and practical lessons. Indeed in every chapter visions of the lively class-room discussions haunted me as I wrote it. I wish this little book would reach them, one and all, and help them recognize themselves in the following pages. with joy.

I am also very grateful to the authors of the various books that I have read ever since I had got interested in the subject in English and Telugu.

My thanks are also due to the Proprietor, the 'Sree Rama Power Press', who got this book neatly printed in a very brief time.

272, Malakpet,
Hyderabad,
30-5-1954.

*The Author,*

Lecturer, Govt. Teachers' Training College;
Part time Lecturer for Telugu
Methodology. College of Education,
Osmania University; Hyderabad.

# ఉపోద్ఘాతము

తెనుగు బోధనపద్ధతులపై రెండుమూడు పుస్తకములకన్న లేవు కనుక ఈ గ్రంథ మధికపరిసంగము కానేరదు.

పాఠశాలయందును, సంఘమునందును మాతృభాషస్థాన మధికమగుచుండుట వలన మాతృభాషోపాధ్యాయుని బాధ్యత పెరుగుచున్నది. భాషాజ్ఞాన మొక్కటియే ఉపాధ్యాయునకు చాలుననురోజులు గతించి, పద్ధతులయక్కర స్థిరపడినది. పద్ధతి బద్ధమైన బోధన బాలురకు, తమకు కూడ లాభకరమని యుపాధ్యాయులు గ్రహించు చున్నారు.

తెనుగు బోధన పద్ధతులయొక్క వివిధసమస్యల అంతర్యమును గ్రహించి, ఉపాధ్యాయుడు వానిని స్వతంత్రముగనెదుర్కొనుటకు సహాయపడునట్లీపుస్తకమును వ్రాసితిని. శిక్షణ పరీక్షలకు మాత్రము కావలసిన యంశముల నరటిపండొలిచి పెట్టినట్లందించలేదు కనుక, పరీక్షలదృష్టితో దీనిని చదువువారికి కొంత ఆశాభంగము తప్పదు. ప్రశ్నలుకూడ చర్చకు దోహదములుగ నుండును; అనేకప్రశ్నల కుపాధ్యాయుడు తన యనుభవమును, ప్రయత్నమును పరిశీలించుకొనవలసి యుండును. అందువలననే వానిని పరిశీలనాంశము లంటినిగాని ప్రశ్నలనలేదు.

విషయమందలి అన్నియంశములును స్థూలముగ స్పృశింపబడినవి కనుక, వివిధప్రణాళికల కుపకరించును. అక్కరనుబట్టి క్రమము, అంశము మాత్రము సరిచూచుకొనిన చాలును.

ప్రాంతీయ భాషలందలి సాంకేతికగ్రంథము లనేకము భాషాంతరీకరణపు ఊసలతో నుండుట చూచుచున్నాము. నా యనుభవమును, ఆరేడేండ్లీ విషయముపై చదివి సంపాదించిన జ్ఞానమును ఆధారముచేసికొని, ఈ గ్రంథమును స్వతంత్రముగ రచించితిని. అందువలన పైసచూపిన లోపమిందుండదని యాశించుచున్నాను. ఒకమారు మూలాగ్రముగ చదివి, తిరిగి క్షుణ్ణపరిశీలనకు దిగిన మంచిలాభ ముండు నని పాఠకులకు మనవి.

సాంకేతికపదములు, వాని ఆంగ్లరూపములు నీయబడినవి. తమ చర్చలు, పాఠములు వలన, ఈ విషయమందలి వివిధాంశములపై నా యభిప్రాయములను పుష్టివంతము చేసిన అనేక ప్రాతవిద్యార్థులకు నా అభివందనములు. ప్రతి యధ్యాయమునందును అట్టిజాడలను వారుగుర్తించి యానందింతురనుకొందును. ఈ గ్రంథ మట్టివారినందరిని జేరునని యాశించుచున్నాను.

నాకీవిషయముతో సంబంధ మేర్పడినప్పటినుండి చదివిన వివిధగ్రంథముల రచయితల కెంతయు కృతజ్ఞుడను.

అతి స్వల్పకాలములో నీగ్రంథమును చక్కగా ముద్రింపించి యిచ్చిన శ్రీరామా పవర్ ప్రెస్ వారికి కృతజ్ఞుడను.

272, మలక్‌పేట
హైదరాబాదు
30—5—'54

రచయిత

# విషయసూచిక

అధ్యాయము. పేజి.

# ఆంధ్రాధ్యాపకము



## 1. సోదరాధ్యాపకులకు

అతడొక ప్రాతవిద్యార్థి; అప్పుడప్పుడు వచ్చి చూచి పోవుచుండును. మాటకారికాడు; పిల్లలక్షేమ మడిగినప్పుడు మాత్రము కాలగమనము గుర్తింపలేడు. "హాయిగ నాడు కొందురు; ముద్దుగ ముచ్చటింతురు; చక్కగ చదువుకొందురు. ఆంగ్లము బోధన సాధనముగా నుండిన మంచిదా, భాష మాత్రము చాలునా?......పంతుళ్ళు ప్రేమగ బోధించిన నెంత బాగుండును! నేను చెప్పినపుడు చప్పుడుచేయక వినరే!......" అది పితృహృదయము.

"అల్లునితో భోజనము, పుత్త్రునితో పాఠము" అను సామెత మనకుండనే యున్నది. ప్రేమాభినివేశము లుపాధ్యాయవృత్తికి పునాదులు; వానిపై జ్ఞానానుభవముల రమ్యమందిరము లేపవలెను. అప్పుడధ్యాపకవృత్తి రాణించును. ఇందనుభవము కాలపరంపరలో గలుగును. ప్రేమాభినివేశములు కొంతవరకు ప్రకృతిసిద్ధములు; కొంతవరకు సంస్కారసంపాదితములు, జ్ఞానము చాలవరకభ్యసనసాధ్యము.

భగవంతుడు మానవ పక్షపాతిగాబోలు: మనకున్న శక్తులు మరే జీవియందును గానరావు, వానిలో మేల్బంతి

యేది? భాష. మానవజీవితములోని సర్వవిశేషములకు బునాది ఈ భాషయేకదా. సంఘము, సౌహార్దము, విద్య, విజ్ఞానము, అందము, హాయి—అన్నిటికి భాష మూలము.

ఇక, 'మానవుడు—భాష' అను సామాన్యభావమొకటి; 'తెనుగు, తమిళము, ఆంగ్లము—ఆయా భాషలవారు,' అను విశేషము మరొకటి.

'మనము తెనుగువారము, మనబిడ్డ తెనుగుబిడ్డ. వీనికి మనభాష నెట్లు చెప్పుకొనవలెను?' అనునదే ఈ పుస్తకము నందలి విషయము.

మనభాషకు తెనుగు, తెలుగు, ఆంధ్రము అను మూడు పేళ్ళున్నవి. ఒకప్పుడు వీని యర్థములలో భిన్నచ్ఛాయలున్న నుండియుండవచ్చును; ఇప్పుడుమాత్రమీ మూడును ఒకేయర్థమున వాడుచున్నాము. కనుక శబ్దసౌందర్యమునకై దీనికి 'ఆంధ్రాధ్యాపకము' అని పేరు పెట్టితిని; స్వీకరింపుడు.

## —• పరిశీలనాంశములు. •—

(1) బోధించునపుడు మీ మనోవృత్తి లక్షణములు పరిశీలించుకొని వానిలో బోధనకుదోడ్పడువానిని, బోధనకవరోధము కలిగించువానిని వివరింపుడు.

(2) ఇట్లే బోధించునపుడు శిశువును పరిశీలించి, వానిలో బోధన దోహదములు, బోధన ప్రతిబంధకములు అగు లక్షణములను గమనింపుడు.

(3) పై నచూపిన పరిశీలనఫలితముల నొక గ్రంథమునందు వ్రాయుచుండుడు. అదియే మీ యనుభవసారము.

## 2. భాష

పల్లెలు, పట్టణములు, చదువులు, సంధ్యలు; తుదకు భాష, పలుకు కూడ లేని అతి ప్రాచీనకాలమునాటి మనుజు నూహించుకొనుడు. పట్టెడు బొుక్కుడుకై పశు పక్ష్యాదులతో గుద్దులాడును. నెగ్గిన ఆనందముతో గంతులిడును; ఓడిన, మొఱ్ఱోయని తుఱ్ఱుమనుటయో, శత్రువులకు చిక్కిన గిజగిజలాడి చచ్చుటయో. కడుపునిండి, కష్టములేని సమయములలో ఏ చెట్టుకొమ్మనుండియో అల్లన చూచును.

ఇట్టి సన్నివేశముల యొత్తిడిలో, నాంతరంగికాను భవానుబంధముగ కలిగిన యరపులు తోటివారికి గుర్తులైనవి. ఆనాటి యతని రాతి పరికరములవలె నీ యరపుగుర్తులుకూడ చాల మొరటుగ నుండెను. కాని క్రమవికాసముచే సున్నితమైన యుపకరణ సామగ్రివలెనే, మనుష్యుని భావబండారము, శాబ్దిక సంపత్తికూడ పెరిగి ఈనాడు మన ముపయోగించు కొను భాషగా రూపొందినవి.

తినుట, నిద్రించుట, తిరుగుట వలె మాట్లాడుటకూడ మానవ ప్రవర్తనలో నొకభాగము, చాల ముఖ్యభాగము కూడ. అతని యితర ప్రవర్తననంతను చుట్టుముట్టి, తీర్చి దిద్దునంత ముఖ్యమైనది.

మూగివారిని చూడుడు. వారిది శూన్యచిత్తము, మొరటుహృదయము. శబ్దసంస్కారమువలని మార్పుచూడుడు. మనమున మెలగిన ప్రతియూహకు, హృదయమున మెరసిన ప్రతి భావమునకు శబ్దమొక రూపమునిచ్చును; దానిని స్థిరముగ మన స్మృతిలో స్థాపించి, ఇచ్ఛానుసారము జ్ఞప్తికి తెచ్చును. ఆంతరంగిక క్షేత్రమునందును, సంఘమునందును కూడ మనము భావముతో వ్యవహరించునపుడీ శబ్దమే ముఖ్యోపకరణము. "అమ్మా, బువ్వ" అనుటనుండి, ఉపనిషద్విచారమువరకు గూడ శబ్దము తప్పనిసరిది. సామాన్యభాషా వ్యాపారము జరుగునప్పుడును, క్లిష్ట జిజ్ఞాసాపరమైన భాషా వ్యాపారము జరుగునప్పుడును, నేర్పడు నాంతరంగిక లక్షణముల స్వభావములో భేదములేదు. ఈయాంతరంగిక లక్షణములు భాషకు ప్రాణమునంటివి. ఇవియే భాషయొక్క మూలధర్మములు. ఇవియే మన యనుభూతులు, స్మృతి, యాలోచన, సంకల్పము మొదలగు మానసిక వ్యాపారములను సమన్వయించి, మన యైచ్ఛిక ప్రవర్తనకంతకును పునాదియగుచున్నవి.

వీనితత్త్వ మింతవరకూహించుట సులభము: ఇంద్రియముల సహాయముతో ప్రపంచానుభూతిని పొంది, భావమును సాధించుకొనుచున్నాము. ఇట్టి ప్రాథమిక భావానుభూతికి మొట్టమొదట శబ్దశరీర మేర్పడుట ప్రకృతి వైచిత్ర్యము. ఈ దశయే భాషాయుగములోని స్తబ్దదశ. భాషా ప్రదర్శనమునకిది పూర్వరంగము; కారకదశ దీనిని వెన్నంటియే

యుండును. ఇట్లు కొంత ప్రాతిపదిక ప్రాయమైన భాషాసామగ్రి యేర్పడినతరువాత దాని సహాయమున భావోత్పాదన మవిచ్ఛిన్నముగ సాగును.

"అమ్మా, బువ్వా," అనుమాటలనుతీసికొని కొంచెము పరిశీలింపుడు. ఆమాటలవెనుక ఆకలియొక్క అనుభూతి, దానికి సంబంధించిన ఆలోచన, సంకల్పము మొదలగునవి యున్నవి. వీనికన్నిటికిని బాహ్యరంగమున స్మృతియున్నది. ఈ సమస్తాంతరంగిక సంఘటనము బూర్తియైనతరువాత నా రెండు మాటలు దాని నావిష్కరించుచున్నవి.

అవి వెలువడినంతనే, వాని ప్రభావమున తల్లి శిశువున కాహార మిడుచున్నదికదా. అనగా, నొకవంక వ్యక్తి చింతనమును, మరొకవంక పరస్పర వ్యవహారమును గూడ పోషించు నుపకరణ మగుచున్నది భాష.

మనుష్యుల సంభాషణా చాతుర్యమునుబట్టి, వారి ప్రతిభావిశేషముల నూహించుచున్నాముగదా. ఈ యవినాభావ సంబంధము శరీరము - ప్రాణమువలె, భావము - పలుకు వేరుపరుపరానివని సూచించుచున్నది. ఇవి పరస్పరాశ్రయములగుటవలన, నొకదాని వృద్ధిక్షయములు మరొకదానిని మార్చుట సహజము. అందువలన పసివారిలో భాషావైపుల్యమును సాధించి భావవైభవమును, ప్రతిభాసంపదను పెంచవచ్చును.

ఈ భాషాశక్తి పశుపక్ష్యాదులకు లేదు. కనుకనే ప్రభువును గుర్తించి ప్రేమించు పశువు, అతని శబ్దసౌభాగ్య

ముచే నానందింపలేదు. దాని మొరటుమెదడులో భావనా శక్తి లేదు;దాని జీవితమంతయు భౌతికము.

శిశువట్లుకాదు; తలిదండ్రుల మాటలువిని, మననము చేయు నిరాకార భావనాశక్తి దానికున్నది. దీనికి ఆలంబనము భాష. దీని యాధారమున మానవజీవితము భావనామయమై పరంపరను స్థాపించుకొనగలిగినది. కాన దేశ కాలములచే సుదూరులైనవారిని తోటివారిగా భావించి, వారి భావజగత్తుతో నేకీభావమును పొందుచున్నాము. భాష నూతగాగొని తరతరాల వైజ్ఞానిక వారసత్వము నవలీలగ నందుకొనుచున్నాము; పిన్నల కందించుచున్నాము.

ఇట్లు భాషా సౌభాగ్యకారణమున, భావక్షేత్రములో మానవున కమరత్వము సిద్ధించినదికదా!

## —• పరిశీలనాంశములు. •—

(1) భాష, పరివర్తనలోని ముఖ్యభాగమనగా నేమి?

(2) పశువు, శిశువు, మీరు—వీరిలో భాషాసంపత్తిలోని విభేదము లెట్టివి?

(3) పై యధ్యాయములోని తుదివాక్యముపై నొక వ్యాసమువ్రాసి, మీబడి "తలిదండ్రుల సమావేశము" లో చదువుడు.

(4) ప్రాగాలపు మొరటు భాష, సువికాసమునొందిన శాబ్దిక సంపత్తి — ఈ రెండింటికిని మన భాషనుండి కొన్ని యుదాహరణలిండు.

(5) "ఒకవంక వ్యక్తిచింతనమును, మరొకవంక పరస్పర వ్యవహారమును గూడ పొసగించు నుపకరణ మగు చున్నది భాష" అను వాక్యభావమును వివరింపుడు.

---

# 3. మాతృభాష

భాషయను సాముదాయిక భావమును తడవి చూచితిమి. ప్రపంచమున అనేక భాషలున్నవికదా. మన దేశములో, ఆర్యులు రాకముందే ద్రావిడభాష, మరికొన్ని యుండెడివి. ఆర్యులతో సంస్కృతము వచ్చి ద్రావిడమును దక్షిణమునకు నెట్టినది. ఇవి రెండు ముఖ్యమైనవి.

కాలక్రమమున ద్రావిడభాష—తెనుగు, తమిళము మొదలగు భాషలుగాను, సంస్కృతము— హిందీ, గుజరాతీ మొదలగు భాషలుగాను రూపొందినవి. పరస్పర సంసర్గముచే నీ భాషలెంతెంతయో మారినవి. కాని, ఇప్పటికిని వాని మూల చట్రములను సులభముగ గుర్తింపవచ్చును.

మన తెనుగు, ద్రావిడ పాదులో సంస్కృత స్నేహముతో బెరిగి, రెండింటి యైశ్వర్యమును ప్రోగు చేసికొనిన వరాలమూట.

ఆధునిక యుగములో మహమ్మదీయులతో ఫార్సీ, అరబ్బి; ఆంగ్లేయులతో నాంగ్లము వచ్చినది. "తురకము"ని మనవారను ఉర్దూ, అచ్చపు హైందవభాష; మొన్న మొన్నటిది.

పల్లె కదలిన భాషల చిక్కులెక్కువ. కాశీపోయిన హిందీ, ఢిల్లీపోయిన ఇంకను ఆంగ్లము ఎదురగును. తెనుగు వినబడిన ప్రాణము లేచి వచ్చినట్లగును కదా? మీకే కాదు. ఆంగ్లములో బుట్టిపెరిగిన ఏ తెనుగు ఉద్యోగినో కదిపి చూడుడు: "మీరాంధ్రులా" యని తల పంకించి ఒక యవ్యక్తానందమును ఛాయామాత్రముగ పొంది, యుస్సురని, యెందే బోవును. ఒకప్పుడొక స్పెయిన్ దేశపుచిలుకను ఇంగ్లండు తీసికొనిపోయిరట. వయసెక్కినకొద్ది ఉత్సాహము క్రుంగి మాటయే మానినది. ఒకనాడు హఠాత్తుగా నొక స్పెయిన్ దేశీయుడు స్వభాషలో పలుకరింపగా, అట్టహాసముచేసి, పరమానంద భరితమై ఆ యుద్రేక ప్రభావమున పంచత్వ మొందెనట!

మాతృభాషయందీ మాధుర్య మెచ్చటిది? ఆనందాది యుద్రేకములకు మూలము భావము (feeling) కదా. మాతృభాషలో నీ భావబలమెక్కువ యన్నమాట. మాతాశిశువుల సంబంధములో ప్రధానమైనది భావమగుట దీనికిదృష్టాంతము. కనుకనే మాతృభాషను వ్యవహరించు నప్పుడున్న యనుభవ సాంద్రత పరభాషా వ్యవహారములో నుండదు. ఈ యనుభవ సంబంధమైన శబ్దశక్తిని "ఉద్దీపనశక్తి" యందురు. రెండవది "సాంకేతిక శక్తి." దీని వలన శబ్దార్థముయొక్క స్పష్ట జ్ఞానము స్ఫురించును; ఆ స్ఫురణ బుద్ధికి మాత్రమందును. పరభాషా వ్యవహారములో సాంకేతిక శక్తిమాత్రమబ్బును; ఉద్దీపనశక్తి యంతగా వికసింపదు. కనుక భావసాంద్రత తక్కువ. వెనుకటి తరము వారి నెందరి నెఱుగము: విద్యా వ్యాసంగ మంతయు నాంగ్లములో సాగి, మాతృభాష సుపరి

చితము కాదనుకొన్నను, వారి రచనలలో మాతృభాషకున్న జీవమాంగ్లమునకు గానరాదు.

చాలకాలము క్రితమే మానవునకు భాషయబ్బినదని చూచితిమి. ఐతే శిశువు పుట్టగనే, అతడు పెద్దయై చేయు పనులేవియు జేయలేడు. నడచుట, మాట్లాడుట మొదలగునవి క్రిమక్రమముగ నలవడును,

## భాషా యుగము

ఒకొక్క వయస్సులో నొకొక్క లక్షణము మన జీవితములో వ్యక్తమగును. భాష యేవయస్సులో నగుపడును? ఆరవనెల కత్త తాత యను వారున్నారు. మూడవయేట మాటయైన రాకున్న మూగివారగుదురేమో యని తల్లులు తహతహలాడుదురు. నాలుగైదేండ్లు వచ్చుసరికి, "వాగుడుతో వేగి పోవుచున్నా"మని తలిదండ్రులు పొరుగువారివద్ద విసుగు కొనునంత విశాలమైన భాషా సంపత్తి. అంతేకాదు: తరతరాలుగా మనమధ్య మెలగిన పరభాషీయుల ఏసలను పట్టి చూపి పకాలున నవ్వుశక్తి దిసమొల వయస్సు నాటికే దృఢపడును. ఈ వయస్సే భాషాయుగము. నాలుగు మాసముల నుండి నాలుగేండ్లనుకొనుడు.

మొదట పెద్దల పలుకుల నాలించును; క్రమముగా వారి పనులకు, పలుకులకు గల సంబంధమును గ్రహించును: శిశువుయొక్క లేత మనస్సులో భాషావ్యాపారము మొదలైనది. శబ్దచ్ఛాయలు క్రమముగా బేరుకొనును. భాషా

యుగములో మొదట భాషను గ్రహించుకాలము, పిమ్మట భాషను ప్రకటించుకాలము ఉండుట సహజము కదా. మొదటిదానిని స్తబ్ధదశ, రెండవదానిని కారకదశ యందురు.

దిసమొల దుడుకులు పరభాషీయుల ఏసలనెత్తి చూపుదురంటిమి. అదెట్లు? అరవ లితరుల భాషలను గ్రహించుట ఆరునెలలని యనుభవసిద్ధమేకదా. అంతటి కష్టజీవులు ప్రయత్నముతో పెక్కేండ్లు సాధించిన తెనుగుకన్న, ఏప్రయత్నము కనబడని మన బుడుతల తెనుగు తేటగ నుండును. ఎందువలన? భాషాయుగములో నున్న భాషా సంగ్రహణ శక్తి యంత ప్రబలమైనది. ఆవయస్సులో శిశువుల బుద్ధి ఫలకము భాషను గ్రహించుట, కెమేరా ఫలకము చిత్రమును గ్రహించుటవలె సులభమైనది. అప్పుడు భాషను విని, అందలి సూక్ష్మ ధ్వనులను పట్టుకొని, వాక్య చట్రములను గ్రహించునంత సులభముగ మరేవయస్సులోను సాధ్యము కాదు. ఈ సహజశక్తికి మాతృవాత్సల్యము, సంఘము, దోహదమై బాలుని తొక్కుపలుకుల కుద్దీపనశక్తిని ప్రసాదింపగా, మాతృభాష కనితర సాధ్యమైన పుష్టి సంక్రమించును.

భాషాయుగమున గ్రహించు భాష నిర్లోపమైన నిర్దుష్ట ప్రతిబింబము. కనుకనే ఫొటోవంటిదంటిమి. తరువాత నేర్చిన పరభాష చేతితో చిత్రించిన చిత్రమువంటి దనవచ్చునుకదా. కష్టమెక్కువ మైనను, కొన్ని లోపములు తప్పవు. చిన్ననాటి సహజ భాషాశక్తి యుడుగుటయే ఈ భేదమునకు కారణము.

ఇక పెద్దప్పటి పరభాషకు, పిన్ననాటి మాతృభాషకు గల యంతర మూహించుట సులభము. మాతృభాషలో నున్న ప్రకృతిశక్తి, భావపాటవము లేనందున, పరభాష ఉద్దీపనశక్తి లేని యాంత్రిక సంపత్తి. అట్లని పరభాషలు నేర్వ రాదని కాదు. సుకర జీవనమునకు, ఈనాటి భారతీయునకు హిందీ, ఆంగ్లముకూడ కావలెను. ఐతే ఐన దానున, కానిది కంచమున బెట్టకుండ మాత్ర ముండవలెను. మొట్టమొదటిది మాతృభాష, ప్రాథమిక దశనుండియు దీనిది ప్రథమస్థానము. రాష్ట్రభాషయగు హిందీ మాధ్యమిక దశనుండి సాగిన చాలు ననుకొందును. ఇప్పటి కాంగ్లము కూడ ఆదశయందే మొదలిడక తప్పుటలేదు. కాలక్రమమున మనభాషలు సహజ స్థానముల నందిన పిమ్మట ఆంగ్లమువంటి పూర్తి పరభాషల నున్నత దశలో ప్రారంభించిన చాలును. ఇక సంస్కృతాది ప్రాభాషలు సార్వజనీనములగుట యసంభవ మనిపించును. మరి భాషాసౌలభ్య మలవడిన ధీమంతు లున్నత దశనుండి యధికముగ గ్రహింప వచ్చును.

## —• పరిశీలనాంశములు •—

(1) మన దేశపు ముఖ్యభాషల జూపు పటమును చిత్రించి, ఆయా భాషల మాట్లాడువారి సంఖ్యలు గుర్తింపుడు.

(2) మీ కేయే భాషలు వచ్చును? వానిలో నేయే గ్రంథములన్న మీ కెక్కువ ప్రీతి ? ఆ యభిమానమునకు కారణము లూహింపుడు.

(3) మాతృభాష పరభాషకన్న యెట్లు ప్రబలమగును? ఈ సందర్భమున చూపిన చిత్రముల యుదాహరణ మెంతవర కంగీకరింతురు?

(4) ఈ యధ్యాయమందలి సాంకేతిక పదములనేరి వాని యర్థమును వివరింపుడు.

(5) భాషా యుగమనగానేమి? దాని ప్రాముఖ్యమేమి?

---

# 4. మాతృభాషా ప్రయోజనములు- దానిని బోధించు లక్ష్యములు

"అమ్మా, బువ్వ" అనునప్పటినుండి, జీవితరంగము నుండి నిష్క్రమించు వరకు మనమంటరము నుపయోగించు భాషయొక్క ప్రయోజనమెంత విశాలమైనదో యూహింపుడు. భాషను నేర్చునపుడు భావిజీవితములో దానిని మనమెట్లు వినియోగింతుమో యూహింపలేనంత విశాలమైనది. ఒక వృత్తివిషయమే చూడుడు: పిల్లలు పాఠశాలలలో చదువు కొనునప్పు "డితడుపాధ్యాయుడు, ఇతడు విద్యామంత్రి, యగును"ని యూహింపలేము కదా. కనుక పిల్లలకు జీవిత రంగమందలి యన్ని సన్నివేశములకు చాలునట్లు భాషను బోధింపవలెను.

ఈ దృష్టితో భాషను పరిశీలించినప్పు డుపాధ్యాయునకు రెండంశములు వ్యక్తమగును. (1) అనూహ్యమైన నైమి

త్తిక ప్రయోజనము, (2) అట్టివానికి ముడిపదార్థము వలె నుపకరించు సమగ్ర భాషాలక్ష్యము. మొదటి దాని స్వరూపమే తెలియనందున నుపాధ్యాయుడు దానిని తరగతి బోధనలో బ్రత్యేక లక్ష్యముగ బెట్టుకొనుట సాధ్యముకాదు. కనుక భాషాప్రయోజనమును వ్యక్తియొక్క సమయస్ఫూర్తికి వదలవలసినదే.

ఇక భాషాలక్ష్యము: బోధనకందివచ్చు, బాలునిలో స్థాపించవగు ప్రతి భాషా లక్షణమును, భాషాలక్ష్యముగా గ్రహింపవచ్చును. అట్టి లక్ష్యమును సాధించినచో భాషయొక్కయనంత నైమిత్తిక ప్రయోజనములు కూడ నెరవేరవలెను. అట్టి భాషాలక్షణములేవి? పరస్పర వ్యవహారములో నొకరు తమ భావమితరులకు జెప్పుట, వారు దానిని గ్రహించుట ఇమిడి యున్నవిగదా. మొదటిది భావప్రకటనము, రెండవది భావ సంగ్రహణము. మనలో మనము భాషావ్యవహారము సాగించుకొనునప్పుడు కూడ నీరెండు ధర్మములును నెరవేరుచునే యుండును. దీనిలో భావప్రకటనమునకు కావలసినంత ప్రయత్నము, భావసంగ్రహణమున కక్కరలేదు. విశేష ప్రయత్నముతో జేయు కర్మ గనుక భావప్రకటనమును కారకాంశమందుము. సాధారణ పయత్నముతో పొందు అనుభవము గనుక భావసంగ్రహణమును స్తబ్ధాంశమందుము.

ఇంతవరకు భాషయొక్క సహజ, సజీవ శబ్దము వరకే పోతిమి. కొంచెము ముందుకు సాగిన, ఇట్టి శబ్దమునకు సాంకేతిక ప్రతిబింబమైన లిపి యెదురగును. లిపి వృత్తములో

వ్రాయుట, చదువుట ఇమిడి యున్నవి. ఇందేది భావప్రకటన సాధనమో, ఏది భావసంగ్రహణ సాధనమో మీరు సులభముగనే గ్రహింతురు: లేఖనము భాషణమువలె కారకాంశము; పఠనము శ్రవణము వలె స్వార్థాంశము.

భాష వెనుక బ్రకాశించు అనుభూతి, ఆలోచన, సంకల్పము మొదలగునవి మన మానవ కుటుంబములో నందరికి సామాన్యములే. కనుక శాబ్దిక చిహ్నములను వినినంతనే వాని కనుగుణ్యమైన యాంతరంగిక విశేషముల నూహించుకొనుచున్నాము. అట్లు చేయలేనప్పుడు భాషావ్యవహారము చిలుకపలుకులే. దీనినిబట్టి భాషావ్యవహారములో భావము ప్రధానమైనదని తేలుచున్నది: అదియే వెలగల వస్తువు; శబ్దమావస్తువు నంటియున్న వెల చీటీమాత్రమే. కనుక భావపుష్టిలేని శాబ్దిక వ్యవహారము వస్తువులేని విక్రయమే. ఉపాధ్యాయుడట్టి యన్యాయమున కంగీకరింపడు గదా. అందువలన తరగతిలో జరుగు సర్వభాషా కృషికిని నీ భావము నంతర్వాహినిగా గ్రహించవలెను. బాలుర ముఖలక్షణములు, పలుకుటలోని యనంత ఛాయలు మున్నగువాని నూతగ జేసికొని నిరంతరము నాయంతర్వాహినిని వెన్నంటియే యుండవలెను.

సారాంశము : భావప్రకటనమునకు, భావసంగ్రహణమునకు భాష సాధనము. ఈసాధనమును బాలునకందజేయగలిగినచో భాషోపాధ్యాయుని ధర్మము నెరవేరును. ఈసాధనము నేప్రయోజనములకు వినియోగించుకొనవలెనో బాలుడు వ్యక్తిగతముగ నిర్ణయించుకొనవలెను. (బాలుని)

భాషాభిజ్ఞత (యుపాధ్యాయుని) లక్ష్యము; భాషావినియోగము (బాలుని) ప్రయోజనము.

భావ ప్రకటనమునకు భాషణము, లేఖనము అను రెండు మార్గములు; ఇవి రెండును కారకాంశములు. భావ సంగ్రహణమునకు శ్రవణము, పఠనము అను రెండుమార్గములు. ఇవి రెండును స్తబ్ధాంశములు.

ఈ నాలుగంశములు భాషా సామగ్రినంతను నావరించును. సాధనచే వీనిని శక్తివంతముగ వికసింప జేసికొనవచ్చును. కనుక వీనిని భాషానైపుణ్యములన వచ్చును. భాషోపాధ్యాయుని నిరంతర కృషి ఈనైపుణ్యములను బాలునకు విధేయము చేయుటయే. ఎవరి భాషాసంపత్తి నైనను బరీక్షింపవలెనన్న, ఈ నైపుణ్యములనేకదా మనము స్థాలీపులాకన్యాయముగా బరిశీలింతుము.

## —• పరిశీలనాంశములు •—

ఈ క్రింది వాక్యములలోని భావమును వివరింపుడు.

(1) "భావపుష్టిలేని శాబ్దిక వ్యవహారము వస్తువులేని విక్రయమే."

(2) "(బాలుని) భాషాభిజ్ఞత (యుపాధ్యాయుని) లక్ష్యము; భాషా వినియోగము (బాలుని) ప్రయోజనము."

(3) "భాషోపాధ్యాయుని నిరంతర కృషి ఈనైపుణ్యములను బాలునకు విధేయము చేయుటయే."

---

# 5. మాతృభాషా బోధన లక్ష్యములు-
# ప్రాథమిక దశ, పైదశ

భాషాసామాగ్రి నంతను నావరించియుండు నైపుణ్యములను బాలునకు విధేయము చేయుటయే బోధనని లక్ష్యమని, వెనుకటి యధ్యాయములో నిర్ణయించుకొంటిమి. ఈ నైపుణ్యములను భాషాసామాగ్రినుండి వేరుచేయలేము. దాని సహాయముతోనే, వానిని సాధింపవలెను. ఐతే భాషా సామాగ్రి యనంతసాగరము వంటిది. ఇందు తొలి తీర్థమేది, మలి తీర్థమేది? అంగడి వ్యవహారము మొదలు నన్నయగారి భారతము వరకు భాషాసామాగ్రి యేకదా.

దీనిని కొంచె మోపికతో బరిశీలించిన నిరాడంబరమైన నిత్యకృత్యపు సామాగ్రి, విశిష్టమైన కావ్య సామగ్రి విభిన్నముగ గమనింపనగును. బాలునికి సంబంధించిన నిత్యకృత్యపు సామాగ్రిలో నాటపాటలు, దైనికజీవితము, పాఠశాలయందలి వివిధవిషయములు చేరియుండును. దీనిని "భాష" యనియు, కావ్యసామాగ్రిని సాహిత్యమనియు వ్యవహరింతుము. భాషానైపుణ్యములు "భాషా" క్షేత్రమున అంకురించి, సాహితీక్షేత్రమున పుష్పించి ఫలించును. వివేకియైన కృషీవలు డంకురమును పోషించనిదే ఫలమపేక్షింపడు గదా.

అట్టి యంకుర ప్రాయమైన భాషయందలి యంశములేవి? శబ్దరాశి, వాక్యప్రణాళిక, కూర్పుకుశలత, భాషా

నైపుణ్యములకివి ముడిపదార్థములు. బడికి క్రొత్తగా వచ్చిన బాలుని భాషను కొంచెము పరిశీలింపుడు. అతని శబ్దరాశి మిక్కిలి పరిమితముగదా. వాక్యప్రణాళిక చాల యసంకీర్ణము. ఇక పలుకులలో కూర్పు కుశలత కంటువడి యుండును. భావప్రకటన నైపుణ్యా మిట్లుండును. దీనినిబట్టి భావసంగ్రహణ నైపుణ్యము కూడ అసమగ్రముగ నుండక తప్పదు కదా. ఈ యపరిపక్వ భాషను సరిదిద్ది పరిపుష్టము చేయనిదే ముందు నకు సాగలేము. కనుక ప్రాథమిక దశలో "భాష" ను, ఆవల సాహిత్యమును ధ్యేయములుగా గ్రహించుట సమంజ సమే కదా.

విద్యా శాస్త్రముతో పరిచయము లేని వారీ భేదము నంతగా బాటింపరు. పాటించినను, సాహిత్యములోని యంద చందముల యాకర్షణకు లొంగి, "భాష" నుపేక్ష సేయుదురు.

ఇచ్చట ఒక హెచ్చరిక యవసరము. ప్రాథమిక దశలో "భాష" లక్ష్యము కనుక సాహిత్య మక్కరలేదా? అట్లని యెవరందురు ? ముఖ్యా ముఖ్యముల గమనికయే గాని, ఏయొక్క దానిని త్యజించుట కాదు.

ఈ విభేదము పాఠ్యగ్రంథముల కూర్పున జూడనగును. చిన్న తరగతులలో నొకే రచయిత యొక్క పాఠములను, పై తరగతులలో వివిధ రచయితల కృతులను నేర్పరతురు. సాహిత్యదృష్టితో రచించిన కృతులకు "భాషా" దృష్టి యుండదు. అందువలన బాలురకు కావలసిన సామగ్రి యందుం డక పోవచ్చును. ఉన్నది క్లిష్టముగ ప్రాథమిక విద్యార్థుల

కందనిది కావచ్చును. ఒకేరచయిత, భాషాదృష్టితో కల్పించిన పాఠములలో బాలురకు కావలసిన సామగ్రిని క్రమబద్ధముగ ప్రవేశపెట్టుటయే ప్రధాన లక్ష్యము.

మనదేశములోని పాఠశాలలలో మాతృభాషలలోను, పరభాషలలోను కూడ ఉన్నత దశవరకు వచనమున వివిధ రచయితల కృతుల ప్రవేశపెట్టుటలేదు. ఇది పరభాషలో సమంజసమే: నాలుగైదేండ్లు కృషి చేసిన గాని "భాష" స్వాధీనము కాదు కనుక, సాహిత్యమంతకు ముందు మొదలు పెట్టరాదు. కాని మాతృభాషలో నీ విలంబన మనవసర మని పించును. ప్రాథమిక దశ కాగానే వివిధ రచయితల పరిచయ మునకు కావలసిన యర్హత బాలునికి కలుగును. మనదేశ ములో చాలమంది ప్రాథమిక విద్యతోనే పాఠశాలను వదలు చున్నారు. అట్టివారికి మన సాహిత్యములోని ముఖ్యవిషయ ముల పరిచయమైన లేనిదే వారికి విద్య విశేష ప్రయోజన కారి కాదు. గొప్ప రచయితల ప్రౌఢ రచనలను పిన్నవారి కనుకూలముగ సవరించి ఉత్తర ప్రాథమిక దశనుండి ప్రవేశ పెట్టుట ఒక మార్గము; ఇది ఆచరణీయమైన మధ్యేమార్గము. ఆంగ్లాదిభాషలలోని Children's Classics ఇట్టివే. పాఠశాల లోని ప్రాథమికదశ తరువాత దుత్తరదశ. దీనిలోని తొలి భాగమును మాధ్యమికదశ యనియు, మలిభాగము నున్నత దశ యనియు వ్యవహరించుచున్నాము. ఉత్తరప్రాథమిక దశలో మొదలుపెట్టిన "క్లుప్తరచన" లను మాధ్యమికదశలో

కూడ సాగనిచ్చి యున్నతదశలో మూలములు ప్రవేశపెట్టుట సమంజసమనిపించును.

## —• పరిశీలనాంశములు •—

(1) "భాషా నైపుణ్యములు 'భాషా' క్షేత్రమున అంకురించి, సాహితీక్షేత్రమునపుష్పించి ఫలించును." ఈ యభిప్రాయ మెంతవరకు సమీచీనము ? దీనినిబట్టి 'భాషా' సాహిత్యముల బోధన కర్హమైన దశలేవి ?

(2) ఒకే రచయిత కూర్చిన పాఠ్యగ్రంథములు, వివిధ రచయితల కృతుల సంకలనములు - పాఠశాలలలో వీని స్థానమెట్టిది ?

(3) "గొప్ప రచయితల ప్రౌఢ రచనలను పిన్నవారి కను కూలముగ సవరించి, ఉత్తర ప్రాథమిక దశలో ప్రవేశపెట్టుట ఒక మార్గము." ఈయభిప్రాయ ములోని లోతుపాతుల నాచరణ దృష్టిలో పరిశీ లింపుడు.

# 6. ప్రణాళిక నిర్మాణము

మాతృభాషా బోధన లక్ష్యములను నిశ్చయించుకొంటిమి. ఇక నా లక్ష్యసాధన కనుకూలించు ప్రణాళికను నిర్మించుకొనుట యెట్లో తెలిసికొన వలెను.

బాలుడు, అంశము, కాలము:— ప్రణాళికా నిర్మాణమునకై ఏయే యంశములు పరిగణింపవలెను? ఈ కృషి యంతయు బాలుని కొరకు కనుక మొదటి యంశము బాలుడు, అనగా నతని వయస్సు, అర్హత మొదలగునవి. తరువాత గమనించవలసినది యంశము. భాషానైపుణ్యములే ఆ యంశము. కనుక వివిధ నైపుణ్యముల నేతరగతిలో నేపరిమాణములో బోధించవలెను అను నిశ్చయము కావలెను,

ఐతే భాషాసందర్భమున అంశములో నొక విశేషమున్నది. గణితము, చరిత్ర మొదలగు విషయములందు వలె భాషలో అంశము నిర్దిష్టము కాదు; భాష జీవితమంత విశాలమైనది కనుక, భాషకు కావలసిన యంశము నెందుండియైనను గ్రహించవచ్చును. అది ఆయా తరగతులందలి పిల్లల కనుకూలముగ మాత్రముండవలెను. అంశము వారి జీవితముతో సంబంధపడినపుడే యట్లనుకూలించును. దినదినాభివృద్ధిచెందు వారి విద్యాభివృద్ధికి కూడ అది సరిపడవలెను.

ఐతే విషయసంబంధమైన యంశనిర్దిష్టత లేకపోయినను, భాషానుబంధమైన కొన్ని విశేషములు మాత్రము స్పష్టమే: శబ్దరాశి, వాక్యప్రణాళిక, కూర్పుకుశలత, వీనినన్నిటిని ఆవ

కింది యుండు వ్యాకరణాంశములు అట్టి విశేషములు. ఉత్తమ ప్రణాళికలో వీని అన్నిటిపరిమితులు ఆయా తరగతులకు నిశ్చయము కావలెను.

ఇక మిగిలినది కాలము. ఇది పాఠశాల కృషినంతను శాసించును. పరిమితమైన కాలములో నొకటి బోధించిన మరొకదానికి స్థానముండదు కదా. కనుక ఆ బోధించు నొకటియు నేదో అతి జాగ్రతతో నిర్ణయించవలెను.

మన రాజ్యపు విద్యాశాఖవారు ప్రాథమికదశకై నిర్ణయించిన మాతృభాషా ప్రణాళికను చూడుడు. దానిలో ప్రతి తరగతికిని కథనము, వాచిక కృషి, పఠనము, లేఖనము అను శీర్షికల క్రింద వివిధాంశములను సూచించిరి. కథనము వాచిక కృషికి సంబంధించినదే; వాచిక కృషియనగా శ్రవణ భాషణముల సంయోగమే కదా. అనగా మనము నిర్ణయించుకొనిన భాషానైపుణ్యములు నాలుగును సూచితమైనవి. ఉత్తరప్రాథమిక దశలో (మూడు నాలుగు తరగతులు) రచన, వ్యాకరణముకూడ సూచింపబడినవి. పూర్వ ప్రాథమిక దశలో నివి సూచింప బడలేదు. ఐనను నివి లేనిదే భాషాకృషి సాగనే సాగదు. ఆ దశలో జరుగు భాషాకృషి యంతటను నిర్ణీత వ్యాకరణాంశము లిమిడి యుండును. వివిధ నైపుణ్యముల యభ్యసనముతోబాటు వ్యాకరణాంశముల వినియోగము సాగుచునే యుండును. లాంఛన ప్రాయముగ వ్యాకరణ బోధనమాత్రముండదు.

ఐతే శబ్దాదుల నిర్ణయము మాత్రము జరగలేదు. అది కష్టమైన పని. అనేక పరిశోధనలు జరిగినగాని, ఆ నిర్ణయము

చేయుట సంభవముకాదు. ఇంకను మన భాషలో నవేవియు జరగలేదు. కనుక వానికి సంబంధించిన ముఖ్య విషయములను మాత్రము సూచింతును.

శబ్దరాశి.— ప్రతిభాషయందును ఇది చాల విశాలముగ నుండును. దానినుండి బాలుర కుపయుక్తమగు శబ్దముల నేరి, ప్రయోగ క్రమముతో వివిధ తరగతులలోని భాషాకృషి ద్వార వానిని బోధింపవలెను.

వాక్య ప్రణాళికలు:— ఇవికూడ ప్రతి భాషయందును విశేషముగ నుండును. శబ్దములవలెనే సౌలభ్య క్రమములో వీనిని కూడ క్రమముగ బోధింపవలెను. కూర్పు కుశలత కూడ ఇక అట్లే క్రమముగ బోధించవలసిన యంశము.

ప్రాథమిక దశ దాటిన తరువాత "భాష"లోని విశేషములు క్రమముగ వృద్ధియగును. వ్యాకరణము నైమిత్తిక దృష్టితో వచన పాఠ కేంద్రితతో సాగును. సాహిత్యములోని మెలకువల బోధన వివిధ రచయితల కృతుల యాధారమున సాగును.

ప్రణాళిక ఎంత స్పష్టముగనున్న ఉపాధ్యాయుని మార్గమంత సుగమము. ఈసందర్భములో నొక హెచ్చరిక. ఈనాడు మన పాఠశాలలలో పాఠ్యగ్రంథములేకచ్ఛత్రముగ నేలుచున్నవి. నిజమునకవి ప్రణాళిక ననుసరించి నిర్మింపబడిన యుపకరణములు మాత్రమే. కాని ప్రణాళికను విస్మరించిన యుపాధ్యాయుడు, పాఠ్యగ్రంథమునే వేదమని నమ్మి వట్లె

వయించును. అప్పుడు భాషయందలి ముఖ్యాంశములు లక్ష్యమునుండి జారును; యాదృచ్ఛికముగ పాఠ్యగ్రంథముల బ్రవేశించిన కథలు వాని స్థానము నాక్రమించును. ఆకథలను వల్లెవేయించిన కలుగు ఫలితము స్మృతిభారము మాత్రమే; దాని క్రింద భాషానైపుణ్యములు నలిగి నశించును. భాషాపరముగ బాలుని యభివృద్ధి శూన్యము. కనుక సర్వభాషా కృషి యందును నిరంతరము ఉపాధ్యాయుని దృక్పథమున నుండవలసినది ప్రణాళిక. అతడెల్లప్పుడు గమనింప వలసిన దీప్రణాళిక ఎంత వరకు సాధింపబడిన దనువిషయమే.

పాఠశాలా జీవితమందలి భాషాబోధన అంతయు నొక సమగ్రమైన మొత్తము. కనుక అప్పుడప్పుడు పాఠశాలయందలి భాషోపాధ్యాయులందరు వివిధ తరగతుల ప్రణాళిక లెట్లు సాగుచున్నవో సంప్రతించు కొనవలెను. అవసరమైనపు డొక తరగతిలోని ప్రణాళికాంశములు మరొక తరగతికి మార్చవచ్చును. అంటువ్యాధులు మొదలగు అనర్థముల వలన బడి దినములు తగ్గి ప్రణాళిక పూర్తి కానపుడు, మరుసటి సంవత్సర మాభాగములను ముగించి, మరి ముందునకు సాగవలెను. ఇట్టి సమన్వయములేని యెడల బాలుర భాషానైపుణ్యములలో గొరత లేర్పడుటయే కాక, పై తరగతులలో భారమగును. మనపాఠశాలలో ప్రతిభా సంపత్తిగల బాలురుకూడ పై తరగతులలో విద్యయందు వెనుకబడుట కిదియొక ముఖ్యకారణము.

ఉదాహరణమునకై శబ్దరాశిని తీసికొనుడు. వచనపాఠము లందలి శబ్దముల ప్రయోగము నశ్రద్ధచేసి, కథలనుమాత్రము చూచుకొనుట సామాన్యముగ జరుగుచున్నది. దీనివలన పై తరగతులలోని కఠినకావ్యభాగములను స్వతంత్రముగ నభ్యసించుటకు చాలిన భాషాభాండారము బాలున కుండదు. అడుగడుగునకు అర్థములు చెప్పుచుపోయిన విసుగు; పరిణాలి కను పూర్తి చేయుటకు కాలము చాలదుకూడ. ఆలాంఛనము తీర్చుటకై యుపాధ్యాయుడు పాఠసంగ్రహములను వ్రాయిం చుట అనివార్యమగును. ఈ వ్యాధి మనదేశమంతటను, విద్య యొక్క అన్ని దశలందును వ్యాపించి యున్నదేకదా.

అంతటితో పోవుటలేదు. ఆయా తరగతుల కర్హమైన భాషాసంపత్తి లేని బాలుడు, భాషాగ్రంథములను స్వతంత్ర ముగ బఠింపలేనట్లే ఇతర గ్రంథములను కూడ బఠింపలేడు. కనుక అన్నివిషయములందును సంగ్రహముల ఉక్తలేఖనమని వార్యమగుచున్నది. మనదేశములో నిటీవల విద్యాపరిమాణ ములు దిగజారుట కిదియొక ముఖ్య కారణము. కాని దీనికి మూలము భాషాబోధనలోని లోపమని ఎంతమంది గ్రహించిరి?

ఇట్లే-శబ్దరాశిలోని కొరతవలన గ్రంథములందలి కఠిన శబ్దము లర్థము కానట్లే-వాక్య ప్రణాళిక, కూర్పు కుశలత సమగ్రముగ నభ్యసింపని బాలురకు, క్లిష్టభావమున కవసర మైన జటిలభాష వివిధవిషయములలోని గ్రంథములందెదురై నపుడు, నిస్పృహ ఏర్పడుట తథ్యము. ఫలితము: మన విద్యార్థికులు సినీమాకథలకు మించిన విశేషపఠనమనిన బెద

రుదురు; శాస్త్రాభ్యసనమనిన చల్లబడుదురు. ప్రణాళికా ప్రాముఖ్య మెంత యధిక మో గ్రహించితిరి కదా.

## పరిశీలనాంశములు

(1) ప్రాథమిక, ఉత్తరదశలందు మాతృభాషాప్రణాళికలో నేయే యంశము లుండవలెను? మీపాఠశాలయందనుసరించు ఐదవ తరగతి ప్రణాళికను పరిశీలించి, దానిని నాలుగు, ఆరు తరగతుల ప్రణాళికలతో బోల్చి చూడుడు.

(2) "పాఠ్యగ్రంథము నిజమునకు ప్రణాళిక ననుసరించి నిర్మింపబడిన యుపకరణము మాత్రమే" ఈ యభిప్రాయమును వివరింపుడు.

(3) భాషాప్రణాళిక, పాఠ్యగ్రంథము, విద్యాపరిమాణములు—వీనికి గల పరస్పర సంబంధములు చర్చింపుడు.

(4) వినోద సాహిత్యము, శాస్త్రములు, ఈ రెండింటి యందును సామాన్య విద్యావంతులకు గల యభిరుచికిని, వారి భాషాజ్ఞానమునకును, ఎంతవరకు సంబంధ ముండును?

## 7. వాచికకృషి

పిల్లలు బడికి వచ్చినప్పుడు, మునుముందు వారితో చనవేర్పరచుకొని వారిని బడి కాకర్షించవలెను గదా. దానికి ప్రేమపూర్వక సంభాషణ ఎంతయో నుపకరించును. అందరుపాధ్యాయులును ఇట్టి సంభాషణ సాగించవలసినదే.

భాషోపాధ్యాయున కిది చాల ముఖ్యమైనది: అతని సర్వ భాషా బోధనమునకు పునాది. వాచికకృషి (నోటిపని, మౌఖిక క్రియ) మూలమున నుపాధ్యాయునకు బాలుని మూర్తిత్వ విశేషములు, భాషాసంపత్తి తెలియును. కనుక భాషణము కేవలము భాషావిశేషము మాత్రమే కాదు. దానితోపాటు భాషించువారి మర్యాద, వివేకము, ఓరిమి మొదలగు నైతిక లక్షణములు వ్యక్తమగును. నేర్పుగల యుపాధ్యాయునకు వీనిలోని లోపములను సవరించు అవకాశ మెంతయో గలదు.

భావపరముగా వాచికకృషిలో నుపాధ్యాయుడు ముఖ్యముగ లక్షింపవలసినవి సక్రమచింతన, సమయస్ఫూర్తి, పరభాషణమందు సహనము, సానుభూతి, భావసంయమనము.

భాషణము నిక భాషాపరముగ బరిశీలింతము. బాలుర భాషణమువలన వారి భాషాపరిమితులు, స్వభావము తెలియును. వీనిలో పిల్లల కుటుంబముల ప్రభావమెంతో కనబడును. విద్యావంతుల పిల్లల శబ్దరాశి విశేషము; ఉచ్చారణ నిర్దుష్టము. అవిద్యావంతుల పిల్లలలో దీనికి భిన్నముగ నుండునని వేరుగ జెప్పనక్కరలేదు.

బాలురు నేర్చియున్న భాషలోని లోపములను ముందుగ సవరించవలెను. వానిలో నుచ్చారణ ముఖ్యము. భావస్ఫురణమునకు అనుభూతిసాంద్రతకు కాకువు, ఆకాంక్ష, విరామము ప్రాణమువంటివి. ఔచిత్యము, సభ్యత, సంప్రదాయము, రీతి, వ్యవహారము, అభినయము, భాషణమును నీడవలె వెన్నంటియుండును. వీనిలో అభినయమును గురించి కొంత యభిప్రాయభేదమున్నది. భాష మానవుని ప్రవర్తనలో నొక భాగమంటిమికదా. కనుక భాషణముతో శారీరక చలనములు (భావానుగుణ్యమైన అభినయము) జతపడియుండును. పిల్లలిదిలేనిదే పలుకనేలేరు. వ్రాతలో అభినయమునకు తావులేదుకదా. నాటకాదులలో మాత్రము కావలసిన సూచనలనిత్తుము. అట్టి యభినయము వేరుకళయే. ఉత్తమరచనలు అభినయసహాయము లేకయే సర్వభావమును ప్రకటించును. నాగరక భాషణమునకుకూడ ఇదియే ధ్యేయము. రాధాకృష్ణన్ వంటి యాధునికవక్త లుపన్యసించునపుడు పెదవులుతప్ప ఏ యవయవమును కదపరు. ప్రశాంతముగ, గంభీరముగ, నిష్పాక్షికముగ భాషించువారట్లే చేయుదురు. కొందరుపన్యసించునపు డుద్రేకముతో నాటకమునందువలె అభినయింతురు. హిట్లరట్లు చేయుచుండెడివాడట. వీరి లక్ష్యము ప్రజానీకము నుద్రిక్తపరచుటయేకాని, ఆలోచింపజేయుట కాదు. ఇట్టివారు తమ భావములను నిరంకుశముగ పరులపై త్రోయుచురేకాని, వారు చింతించుకొనుట కవకాశమియ్యరు. ఇది సభ్యతకు, న్యాయమునకుకూడ విరుద్ధముకనుక బాలురకు

మంచిదికాదని వేరుగ జెప్పనక్కరలేదు. ఐతే ఇది క్రమముగ సాధింపవలెను. ఒక్కమారుగ నభినయ మరికట్టిన్న బాలుర ప్రకటనశక్తికూడ క్షీణించు ప్రమాదమున్నది. భాషపై నధికారమును పెంచుచు, నభినయమును సన్నగిల జేయవలెను.

భాషణము సహజముగ, సరళముగ, స్పష్టముగ నుండవలెను. పలుకులోను, భావములోనుకూడ స్పష్టత కావలెను. కొందరు మాట్లాడునపు డక్షరములను మ్రింగుదురు; దీర్ఘములు తీయుదురు; తుంచుదురు. వారియుటకు సంభవము కానన్ని లోటుపాట్లుండును. వీనినన్నిటిని సమయానుకూలముగ సవరింపవలెను.

వాచికకృషిలో బాలురనుండి పూర్తి వాక్యములను గ్రహింపవలెనా యని పలువురుపాధ్యాయులు ప్రశ్నింతురు. అది సందర్భానుసారముగ నిర్ణయించవలెను: భావమే ప్రధానమైన ప్రశ్నకు, భావసూచకమైన ఏకశబ్దమే చాలును. (ఉ — ఉక్త లేఖనమున కందరు సిద్ధముగ నున్నారా ?— ఉం. లేనివారెవరు?—మౌనము.) పూర్తి భావము లక్ష్యముగాగల ప్రశ్నకు పూర్తివాక్యము కావలెను. (ఉ. మనపల్లెల యార్థికాభివృద్ధికొరక యుపాయము సూచింపుము.—వానిలో చేతిపనులు స్థాపించవలెను.) ఒక్కొక్కప్పుడు వాక్యప్రణాళికను గమనింపక, బాలురు తప్పు అన్వయమును సూచింతురు. అప్పుడుకూడ పూర్తి వాక్యము కావలసియుండును. ఇట్టి సమయములందు, బాలుడు తప్పర్థము చెప్పిన మూలవాక్యమును

పూర్తిగ పలికించి, పిమ్మట దానిభావమును బాలుని స్వంత వాక్యములో చెప్పింపవలెను. ఐతే సామాన్యముగ మాతృభాషలో భావమును సూచించు ప్రత్యుత్తరములు చాలును. ఎల్లప్పుడును పూర్తివాక్యము లుపయోగించుట యసహజముగ నుండును.

బాలుర భాషణము నిర్దుష్టముగ నుండిన వారి వ్రాత కూడ సుష్ఠుగ నుండును. వ్రాత పలుకుయొక్క ప్రతిబింబమే కదా. పై తరగతులలోగూడ వాచికకృషి ఎక్కువ వినియోగకారి. భాషణములో బాలురభాష విపులముగ, వేగముగ ప్రదర్శితమగును. అట్లే వారి భావసంపత్తికూడ. ముఖాముఖిని సాగును కనుక వ్రాతలోనగుపడని పిల్లల అనేక అపోహాలు భాషణములో వెలువడును. ఉపాధ్యాయుడు వానిన్నిటిని సులభముగ సవరింపవచ్చును.

వాచికకృషియొక్క ముఖ్యలాభ ముత్సాహము. భాషకు సహజ వాతావరణము జీవితముకదా. వాచికకృషి సమయమున తరగతియందట్టి సహజ వాతావరణము లభించును. అచ్చటి పలువురుబాలు రొక్కుమ్మడి పాల్గొందురు. ఉత్తమ వాచికకృషివలన బాలుని భాషా భాండారము పెరుగుటయేగాక, అతనియందలి సృజనశక్తులుకూడ వికసించును.

శ్రవణము.— వాచికకృషిలో శ్రవణ భాషణము లుమ్మడిగ సాగునుకదా. పై వాచికకృషి ప్రస్తావమీ రెండింటిని దృష్టియందుంచుకొని సాగినది. వానిలో భాషణ ప్రాధాన్యమును మీరు గమనించియే యుందురు.

సామాన్యముగ శ్రవణమొక విశేష మనిపించదు. ఐతే దానిని భాషానైపుణ్యములలో నొకటిగ బేర్కొంటిమికదా. పఠనము శ్రవణమువలె సుబోధాంశమనికూడ చూచితిమి. పఠనము సులభమైనది కాదుగదా. లిపిని గ్రహించుట; శబ్దరాశి, వాక్యప్రణాళిక, కూర్పుకుశలత మొదలగువానిని ధారాళముగ ననుసరించుట, వానివెంబడి భావపరంపరను సాధించుట, మొదలగుపనుల మొత్తమేకదా పఠనము. వీనిలో లిపితప్ప మిగిలినవన్నియు శ్రవణమునకును తప్పవుగదా. ఐనప్పుడు దానికి కూడ సుశిక్షణ కావలెను.

మాట్లాడువారి యంశమునంతను సమగ్రముగ విని, అందలి సారాంశమును గ్రహించుట శ్రవణముయొక్క ధ్యేయము. పరుల ప్రసంగముమధ్య నేదోయొక్క చర్చనీయాంశము వచ్చినప్పుడు దాని పరిశీలన సాగించరాదు; అట్లే ప్రసంగప్రభావమున మనలోస్ఫురించు భావ ప్రవాహములలోబడి కొట్టుకొనిపోరాదు. ఇట్టి మానసిక వ్యాపారములు శ్రవణమునకు ముఖ్యమైన అంతరాయములు. చంచలచిత్తులగు శిశువులట్టివానికి సులభముగ లొంగిపోవుదురు. అట్టి యభ్యాసములుడిగి, మునుముందు ప్రసంగమును సాంగోపాంగముగ గ్రహించి పిమ్మట దానిని విమర్శించు అభ్యాసము చేయవలెను.

బాలుర యాటపాటలు, నిత్యజీవితము, వ్యాపకములు, చేతిపనులు, చిత్రలేఖనము, రూపకీకరణము, కథలు మొదల

లగునవన్నియు వాచికకృషికి తరుగని సామగ్రినిచ్చును. వాని నుపయోగించు నేర్పు మనవిధి.

## —• పరిశీలనాంశములు. •—

(1) భాషాబోధనకు వాచికకృషి ప్రాముఖ్యమెట్టిది ?

(2) వాచికకృషిలో బాలుర భాషణమంతయు బూర్తి వాక్యములలో సాగుట ఎంతవరకు సమంజసము ?

(3) భాషణాభినయముల పరస్పర సంబంధములను చర్చించునది.

(4) శ్రవణమునందేర్పడు నంతరాయములు, తన్నివారణోపాయములు వివరించునది.

(5) "ఉత్తమవాచికకృషివలన బాలుని భాషాభాండారము పెరుగుటయేగాక, అతనియందలి సృజనశక్తులుకూడ వికసించును." ఈ యభిప్రాయమును విమర్శింపుడు.

(6) వ్రాతకన్న వాచికకృషి బాలుని భాషాభివృద్ధికెట్లు లాభకారి ?

# 8. పఠనబోధనము, బాలశిక్ష

నూతనముగ బడికివచ్చిన బాలునితో కొంతకాలము వాచికకృషి సాగించినపిమ్మట ఉపాధ్యాయుడు పఠనబోధనమున కుపక్రమింపవలెను. పాఠశాలలోని విద్యావ్యాపారమున కంతకు వాచికకృషితరువాత పఠనమే ప్రధానమైనది. బాలుడు పై తరగతులకు పోవుకొద్ది పఠనప్రాముఖ్య మధికమగును.

పూర్వ మన్ని భాషలవారును ముందుగ తమతమ వర్ణమాలలను చదువను వ్రాయను నేర్పి, తరువాత చదువుట నేర్పెడివారు. భాషను వ్రాయుటకు వర్ణమాలలోని యక్షరములకు మించిన సామగ్రి యక్కరలేదుకనుక ఇది సులభమని వారిభావము. భాగములు స్వాధీనమైన, మొత్తము స్వాధీనమగునను నమ్మకముతో ప్రాచీనులట్లు చేయుచుండిరి. దీనిని సంశ్లేషపద్ధతి యందురు.

కాని, మానసిక శాస్త్రప్రభావము విద్యపై బ్రసరించిన తరువాత ఈ యభిప్రాయము మారినది. ఒకచిన్న యుదాహరణమును పరిశీలింపుడు. ఒకమనిషిని గుర్తించునపుడు మనము వాని వివిధాంగములను పరిశీలించి, మొత్తమును పోల్చుకొనుచున్నామా? లేదు. మొత్తపు విగ్రహము నేకముఖమున గ్రహించుచున్నాము. అట్లే వాక్యమునంతను మొత్తముగ గ్రహింతుముగాని అక్షరమక్షరము గుణించుకొని వాక్యమును గ్రహించము. మొట్టమొదట పిల్లలు జీవిత సన్నివేశములందలి వాక్యములతోనే భాషను నేర్తురుగాని

అక్షరములు నేర్చి వాక్యములను కూర్చుకొనరుగదా. అనగా పిల్లలమనస్సు ఒక భావయుక్తమైన ఏకమొత్తమును గ్రహించి క్రమముగా వివరములు పరిశీలింపగలదుగాని, వివరముల మూలముగా మొత్తమును సులభముగ సాధించుకొనలేదు. పిల్లలమనస్సున కనుకూలమైన ఈ పద్ధతిని విశ్లేషపద్ధతి యందురు. ఆధునిక విద్యావిధాన మేర్పడిన అన్నిదేశము లందును ఈ పద్ధతియే ఆచరణలోనికి వచ్చినది.

మన భాషలో మాత్రమింకను ఇది రాలేదు సరికదా, అక్షరపద్ధతియే బలముగ పాతుకొనిపోయి యున్నది. బోధనా భ్యసన కళాశాలకువచ్చిన వందలకొద్ది యుపాధ్యాయులు "పరీక్షలు నెగ్గుటకే వాక్యపద్ధతి ననుసరింతుముకాని ఆచర ణలో నది నిరుపయోగ" మందురు. కాకతీయ బాలశిక్షలో వాక్యపద్ధతిని ప్రవేశపెట్టితిమి. దానిని బోధించవలసిన యుపా ధ్యాయులనేకు లాడిపోయుచున్నారు. సంప్రదాయముయొక్క ప్రభావమట్టిది. కనుక ఈ పద్ధతులనుగురించి విపులముగ నివ రింతును. నిష్పాక్షికముగ పరిశీలించి, మీ బుద్ధికి నచ్చినదాని నాచరించుటకు వెనుదీయకుడు.

ఈ యక్షరముల నొకేమారు చదివినపిమ్మట ఎన్ని జ్ఞాపకముండునో చూడుడు: గ—యి—ద్ధ—తు—అ—ప—ము—కొ —ని—పా—ర—పో—క్ష—ది—న్న—తి—యు—ల—బ—— మీ జ్ఞాపక శక్తినంతనువినియోగించి ఎన్నిమారులుచదివిన నవి వచ్చునో గమనింపుడు, ఇక నవే యక్షరములతో కూర్చిన ఈ వాక్యము నొకమారు చదువుడు: "అక్షరపద్ధతి బలముగ పాతుకొని

పోయి యున్నది.'' ఒకేఒకమారుతో మీకు స్వాధీనమైనది— నాకు నమ్మకనే. ఇది యంగీకరించిన మీ రక్షరపద్ధతిని చిత్రవధచేసి వాక్యపద్ధతిని చేపట్టితిరన్నమాటే.

పై యుదాహరణములోని మానసిక శాస్త్ర విశేషము లిక వివరింతును. పొడియక్షరములు గాలిలోని రేణువుల వంటివి; అర్థరహితములు. స్మృతికి నర్థమే యాధారము. కనుక అర్థహీనములైన యక్షరములను జ్ఞాపకముంచుకొనుట కన్న, అర్థమున్న వాక్యములను జ్ఞాపకముంచుకొనుట పిల్లల కనేకరెట్లు సులభము; కాలమెంతయో కలిసి వచ్చును. మన అక్షరములలోని వరుస అసలు వైయాకరణుల ఉత్పత్తి దృష్టితో నేర్పరచినదే కాని యుపాధ్యాయులు విద్యామానసిక శాస్త్ర దృష్టితో నేర్పరచినది కాదు.

అర్థరహితమైన యక్షరములలో బాలుర కెట్టి యాకర్షణయు నుండదు; వానియందు వారికే యభిరుచియు లేదు. ఇక వారి యాటపాటలకు సంబంధించిన వాక్యముల నల్లి యందింపుడు: అవలీలగ గ్రహింతురు. అభిరుచిగల వానిలో నొక నిమిత్తము గోచరించి, దాని యొత్తిడిలో బాలుర ప్రయత్నముగ నభ్యసింతురు. కనుకనే విద్యామానసిక శాస్త్రము, బోధనకు నిమిత్త స్థాపన ముఖ్యమని ఘోషించుచున్నది.

మరొకమాట: అక్షరముల బోధన సాగునపుడు ముందు వర్గమునకు సాగుసరికి వెనుకదానిని విస్మరింతురు. వెనుకటి యక్షరముల యభ్యాసమునకు ముందక్షరములలో

తావేలేదు. వాక్యపద్ధతిలో నిట్టి యనర్థ మక్కరలేదు. వెను కటి వాక్యములందలి యక్షరములను (ధ్వనులను) పునః పునః ప్రవేశపెట్టుచుండవచ్చును. దీనితో పాత వర్ణముల యభ్యాసము, క్రొత్త వర్ణముల యభ్యసనము కూడ సాగును.

లిపి, ఉచ్చారణ మొదలగువానిలో సులభమైన వర్ణములనే వాక్యములలోకూర్చి ముందు బోధన సాగింపవచ్చును. నోరు తిరగని యక్షరములకూడ నెట్లోనెట్టి, వర్ణమాలను పూర్తి చేసికాని అక్షరపద్ధతిలో పఠన ప్రారంభించుటకు వీలులేదు.

విద్యాశాంతకును మూలము బాలుర స్వయంకృషి కదా. వారి జీవితముతో ముడిపడిన వాక్యములందు బాలురకొక ఆత్మీయత గోచరించును. కనుక వానిని నేర్చుట కెంతయో కృషి చేయుదురు. మరి వర్ణమాల యుపాధ్యాయునిది: వారి కాసక్తియే యుండదు.

వాక్యపద్ధతిలో బాలుర యందలి యనంత వ్యక్తి భేదములను పాటించుచు బోధన సాగించవచ్చును. వర్ణపద్ధతిలో నట్టిదానికి తావులేదు.

అన్నిటికన్న ముఖ్యమైనవి పఠనములో ధారాశుద్ధి, భావము కదా. వర్ణపద్ధతిలోనివి రెండును కుంటువడును. చూడుడు: "అ-క్ష-ర, అక్షర; ప-ద్ధ-తి, పద్ధతి; బ-ల-ము-గ; బలముగ, పా-తు-కొ-ని, పాతుకొని; పో-యి-యు-న్న-ది, పోయియున్నది." ఈవిధముగ కొన్ని యక్షరములను బండగ విఫరించి వెనుకకు వచ్చి వానిని కూర్చుకొనిన గాని పదము

లేర్పడవు. తిరిగి వానిని కూడ బలుకకొనినగాని భావము బ్రిద్దలుకాదు. ఈ యభ్యాసములవడిన బాలురకు సరళపఠనము కాని, సులభాన్వయము కాని వేగముగ నబ్బవని వేరుగ జెప్పవలెనా ? బడియన్న రీతమాత్రము తథ్యము. మరి వాక్యపద్ధతిలో పఠనము తోడ్తోడనే సరళత, భావస్ఫురణము కూడ లభించును. భావమార్గమున సృజనాత్మకమైన రచనకు పునాదులేర్పడుచున్నవి. మరి యక్షరపద్ధతి యాంత్రిక సంపత్తియే. కనుక అర్థము, అభిరుచి, శిశుజీవిత సంబంధము, అభ్యాసావకాశము గల వాక్యములలో నక్షరములను బోధిగిన, బాలురాసక్తితోను, ఆత్మీయతతోను, శీఘ్రముగను, భావస్ఫోరకము, సృజనాత్మకమునైన సరళపఠనమును నేర్తురు. ఈ సందర్భమున మనవారి "ఓనమాలు" జ్ఞప్తికి వచ్చును. వానిమొత్తమొక శైవమంత్రము. దానినొక్కమారు వినిన జ్ఞాపకముండునుకదా. పిమ్మట విశ్లేషపద్ధతిని విడియక్షరముల పరిశీలన సాగును. ఒకవిధముగ నిది వాక్యపద్ధతియేగదా. తెనుగువారేదోరూపమున పూర్వమిట్టిపద్ధతినే యనుసరించుచుండిరన్నమాట.

బాలశిక్షలో బాలుర కర్థముగానిమాట ఒక్కటియు నుండరాదని గ్రహింపవలెను. దానిలక్ష్యము పఠనబోధనయే గాని, శబ్దరాశి నభివృద్ధిజేయుటకాదు. బాలురు బడికి వచ్చు సరికే అనేకశబ్దముల నెరిగియుందురు. వానినన్నిటిని చదువ నేర్చినతరువాత క్రొత్తవానిని నేర్పవచ్చును. అట్లే వ్రాత

కూడ పఠనము నేర్పినవిమ్మటనే మొదలుపెట్టవలెను. "ఒకమారు రాకేపని" యను నాంగ్లసామెతను గమనింపుడు.

ఈ పద్ధతి నాచరణలో బెట్టుటకు అచ్చుబాలశిక్ష నిజమునకు పూర్తిగ చాలదు. బాలుర తాత్కాలికాభిరుచిని బట్టి, అప్పటికప్పుడా పుస్తకమున లేని వాక్యములనెన్నియో ప్రవేశపెట్టవలసి యుండును. కనుక బాలశిక్ష ఒక సూచనయే. అందలిపద్ధతి ననుకరించి ఎన్నెన్నియో, యుపాధ్యాయుడు సమయస్ఫూర్తితో కల్పించవలెను; అట్లు కల్పించుకొనుటకు బాలుర నుత్సహింపవలెను.

అక్షర పద్ధతి యనుకూలమైనది కాదని గ్రహించిన తరువాత, యుపాధ్యాయుల దృష్టి యక్షరములనుండి మరలి శబ్దములపై బడినది. కొంతకాలము శబ్దపద్ధతి ననుసరించిరి. శబ్దమే భాషకు ప్రాతిపదిక యను నమ్మకమే దీనికి కారణము. శబ్దమున కర్థమున్నది కనుక అక్షరములకన్న శబ్దములు పఠన బోధనకెక్కువ అనుకూలములే. కాని, వాక్యముతో పోల్చి చూచిన భావపుష్టిలో శబ్దము చాల అసమగ్రమైనది, నీరసమైనదేకదా. జీవిత రంగమున భాషను వ్యవహరించు నప్పుడు అఖండవాక్యమే ప్రాతిపదిక. దాని విశ్లేషముచే పెద్దలు సాధించినది శబ్దము. ఈ విషయమును గ్రహించిన తరువాత శబ్ద పద్ధతిపోయి వాక్యపద్ధతి రూఢమైనది.

శబ్దవాక్యముల అన్వయ తారతమ్యములను గురించి మన ప్రాచీను లెంతయో చర్చించిరి. శబ్దవాదుల కభిహితా

న్వయ వాదులనియు, వాక్యవాదుల కన్వితాభిధాన వాదు లనియు పేరు.

వాక్య పద్ధతియని ఒకదానితో నొకదానికి సంబంధము లేని వాక్యములను ప్రవేశపెట్టరాదు. వాక్యాంతరమునందు వలెనే, వాక్యముల మధ్యగూడ పరస్పరమైన భావసంబంధ ముండవలెను. లిపి, భావమును గ్రంథస్థము చేయుట కుపయో గించు సాధనమే కదా. కనుక కొంతవరకు లిపి నాశ్రయించి యున్న శబ్దము, వాక్యము అను పేర్ల నీపద్ధతికి పెట్టుటయే అంత సమంజసముకాదు. భావప్రధానమైన ఒక పూర్ణత్వ సూత్రము నాశ్రయించి యున్న పద్ధతి కనుక దీనిని పూర్ణ పద్ధతి యనుట లెస్స.

మావద్ద శిక్షణపొందిన వారిలో బూర్ణపద్ధతి నంగీక రించినవారు లేకపోలేదు. ఎట్టి శిక్షణయు బొందని, నాకు పరి చయములేని, యుపాధ్యాయులు కొందరు కాకతీయ వాచకము లోని పద్ధతికై యభినందించిన వారు నున్నారు. అట్టి వారి సూచనపై, తరగతిలో ననుసరించవలసిన కొన్ని మార్గముల నిట నుదహరింతును.

మునుముందు వాచిక కృషి సాగును. దానిలో బాల శిక్షలోని మొదటిపాఠ ముపాధ్యాయుడు దృష్టియందుంచు కొనును. అట్లు దానియందలి వాక్యములు, ధ్వనులు పాప లకు పరిచయమగును. అప్పుడిక నావాక్యముల శాబ్దికస్మృతిని వాని లిపి కతుకవలెను. వీని రెండింటికిని మధ్య చిత్రములొక గొప్ప వంతెన. బాలశిక్షయం దివి యుండును. ఆచిత్రములను,

వానికి సంబంధించిన వ్రాతను తరగతి ప్రదర్శనమునకు యోగ్యమైన పెద్ద యట్టలపై దించుట ఉత్తమము. బాలశిక్ష యందే చూపుట కనీస ధర్మము. వానిని చూచుచుండగా వాచిక కృషి సాగును. ఈచూపు ప్రాముఖ్యమును నొక్కి చెప్పుటకై కొందరు "చూచి చెప్పు పద్ధతి" యనిరి. సరళతకై దృక్పద్ధతి యనుడు. వాచిక కృషిని సజీవము చేయుటకై పాఠమునందలి వాక్యముల కనుకూలమైన అభినయము పిల్లలు చేయుదురు. ఒక్కొక్కప్పు డుపాధ్యాయుడు కూడ వారితో కలిసి యభినయించుట వారికెంతో యానందము నిచ్చును.

కమల ఆ పలక

ఆ పలక కమల పలక

ఈ ఈల

ఈ ఈల కమల ఈల

అరగంట తరగతి కృషిలో నీమూడు ముక్కలు గుర్తించుట ఆశ్చర్యము లేదు. ఇక వానిని పిల్లలు మరవకుండ అభ్యసింప జేయవలెను. ఒకేచిత్రము, వ్రాత గల చిన్న అట్టలు; వస్తువులతో నొక్కొక్క విద్యార్థి ఒక్కొక వాక్యము నభినయించుట; ఉపాధ్యాయుడు నల్లబల్లపై వ్రాయుట మొదలగునవి చక్కని యభ్యాసోపాయములు. పిమ్మట చిత్రము లేకుండ లిపితో నభ్యాసము చేయించవలెను. ఇట్లు చేసియో, చూచియో, చదివియో, పరులు చదువుటవినియో మొత్తము 200సార్లు మననము చేసినది నిద్రయందైనను మరవనంత బలముగ రూఢమగును. ఐదు పది నిమిషములకు

మించిన, సాధారణముగ నొక యభ్యాసోపాయము విసుగు పుట్టించును. అధమము అభినయించు విద్యార్థులు, స్థలము, వస్తువులు మొదలగు వానిని మార్చుచుండ వలెను. ఇట్లు ప్రతి పాఠమునందును పరిచయదశ, అభ్యాసదశయని రెండుదశలు స్పష్టముగ నుండును. వీనిలో దేనిని అశ్రద్ధ చేయకూడదు. పై పాఠమువలన నారక్షరములు నేర్చినట్లగును. ప్రతిపాఠము చివర నాయక్షరములను, కొందరుపాధ్యాయులు విడివిడిగ నభ్యసింప జేయుచున్నారు. మరికొందరు వానిని ముందే బోధించి, వాని పాఠమునకు సాగుచున్నారు. ఈ రెండును అక్షరపద్ధతియొక్క సంప్రదాయములోని యభ్యాసములే. ఐతే నాలుగైదు పాఠముల కొకమారు బాలుర స్మృతి పరీక్షగా మెరపు టట్టలపై పొడి యక్షరములు వ్రాసి ఆటగా నభ్యాసము చేయింపవచ్చును. "శబ్దనిర్మాణపు టాట" నభ్యాసదశలో పిల్లలెంతయో నానందింతురు. ఇట్లొక మాస ములో ధారాళముగ చదువగలరు; వర్ణమాలలోని అన్ని యక్షరములు గుర్తింపగలరు.

ఈ పద్ధతిలో నుపాధ్యాయుడు కొంతశ్రమ పడవలెను. చురుకుదనము, సమయస్ఫూర్తి, అన్నిటికన్న ముఖ్యముగ, మనము మొదట అనుకొనిన ప్రేమాభినివేశములు కావలెను. అక్షరపద్ధతిని, కొందరు పెద్దపిల్లల నక్షరముల వ్రాసి ఇయ్య నాజ్ఞాపించిన చాలును. ఐతే భావిపౌరుల సంసిద్ధతకు తమ జీవితముల నంకితము జేసిన యుపాధ్యాయులు, ముఖ్యముగ ప్రాథమికోపాధ్యాయులు, శ్రమకు వెనుదీయరు. నూతన

దృక్పథము, కావలసిన జ్ఞానము అలవరచుకొనిన తప్పక వారీ నూతనమార్గ మవలంబింతురు. రెండు మూడు నెల లభ్యాసమైన నీపద్ధతిలోని బోధన నైపుణ్యముకూడ కరతలా మలక మగును. పాఠశాలలో సామగ్రి యుండదని ఒక యభ్యంతర మున్నది. ప్రతియుపాధ్యాయుడును స్వంత సామ గ్రిని చేకూర్చుకొని, స్థానచలనమైనపుడెల్ల తన సామగ్రిని తనతో గొని పొమ్మని నాసూచన. చరిత్ర, భూగోళమునకు సంబంధించిన చిత్రములు, పటములు మొదలగు సామగ్రిని మా ప్రాతవిద్యార్థి యొకడట్లు చేయును. క్రొత్తపాఠశాలకు మారిన వెంటనే తన దుకాణమును విప్పును; బోధన సాగును. అతని పాఠములకు పిల్లలు క్రొత్తనీటికి చేపలెక్కి నట్లెక్కు దురు. వృత్తియందభినివేశమట్టిది.

## పరిశీలనాంశములు

(1) సంశ్లేష విశ్లేషపద్ధతులన నేమి ?

(2) అక్షరములలో వైయాకరణుల వరుస, యుపాధ్యా యుల వరుస, అనగా నేమి ?

(3) వాక్యపద్ధతిని సంగ్రహముగ చెప్పిన వాక్యమొకటి యధ్యాయము నందున్నది. దానిని వ్రాసి వివరింపుడు.

(4) పఠనము, లేఖనము, శబ్దరాశి బోధనము, ఈ మూడింటికిగల పరస్పర సంబంధ మెట్టిది ?

(5) తెనుగువారి ప్రాచీన సంప్రదాయములలో వాక్య పద్ధతిని పోషించువానిని విమర్శింపుడు.

(6) అక్షరపద్ధతి, శబ్దపద్ధతి, వాక్యపద్ధతి, దృక్పద్ధతి, పూర్ణపద్ధతి, వీని స్వభావమును స్పష్టముగ, క్లుప్తముగ వివరించి, వీనిలో మీరేది అనుసరింతురో సహేతుకముగ వివరింపుడు.

(7) వాక్యపద్ధతిలో నొక క్రొత్తపాఠమును చెప్పి, అందలి పరిచయదశను, అభ్యాసదశను వివరింపుడు.

(8) నూతనముగ వాక్యపద్ధతిని పరిచయము చేసిన యక్షరము లభ్యాస మెట్లు చేయింతురు?

(9) తెనుగున ధారాళమైన పఠనము బోధించుట కేయుపకరణము లవసరము? అవన్నియు మీపాఠశాలలో నున్నవా? లేకున్న నాకొరతను దీర్చుటకు మీరేమి ప్రయత్నము చేయుచున్నారు?

# 9. ఉచ్చారణము

భాషకు పఠనలేఖనములు రెండును కృత్రిమ రూపములే. భాషణమే సహజరూపము. సంస్కారములోను, సహజ శక్తులలోను, వయస్సులోను, ననంతభేదములుగల వ్యక్తులనోళ్ళలో ఉచ్చారణ మేకరూపమున బ్రదర్శింపబడుట యసంభవము. ఈ సహజ కారణమువలన శబ్దములలోని యూనిక, ధ్వనులు, తుదకు రూపములుకూడ మారి భాషయే మార్పునొందును. అట్టి మార్పులు భాషయొక్క సుస్థితికి భంగము. అందువలన ప్రతిభాషకును ఉచ్చారణము ప్రాణము వంటిది.

ఆర్యుల సర్వస్వమైన వేదములలో నుచ్చారణమున కున్న ప్రాముఖ్యము మరే వాఙ్మయమునను లేదనుట అతిశయోక్తికాదు. లిపికి పూర్వమే విపులవాఙ్మయ మేర్పడుట దీనికి ముఖ్యకారణము. వేదము లపౌరుషేయములుగ భావింపబడుటవలన వాని యుచ్చారణములో నిర్దుష్టత ఆర్యులకు పరమధర్మమైనది. ఈ వర్ణమాత్రలోపము వలన దేవత లలుగుదురని వారిభయము. ఉచ్చారణములో నీ వర్ణభేదము వలన నాభాషలోని శబ్దములకు విశేషార్థభేదము లుండుట కూడ యొక కారణము.

ఇన్నిటివలన ఉచ్చారణమునకు సంబంధించిన శాస్త్రము నార్యులు పరిపూర్ణముగ వృద్ధిచేసి, దానికి శిక్షాశాస్త్రమని పేరిడి, దానిని వేదముల షడంగములలో నొకటిగ జేసిరి,

దేశభాష లన్నిటికిని సంస్కృత ధ్వని ప్రణాళిక ముఖ్యమైనది. వానిలో లేక, దేశభాషలలోనున్న ధ్వను లల్ప సంఖ్యాకములు; చాలవరకు సంస్కృత ధ్వనులతో బోలిక గలవి.

జనసామాన్యమా యా భాషలలోని ధ్వనుల నప్రయత్నముగ గుర్తించి, శుద్ధముగ బలికిన జాలును. కాని, యుపాధ్యాయుని బాధ్యత అంతకన్న అధికము, విశిష్టము: అతడు నిర్దుష్టముగ బలుకుటయే కాక, బాలురచే బలికింపవలెను. ఈ ధర్మమును నిర్వర్తించుటకై భాషయందలి వివిధ ధ్వనుల నిర్మాణవిధానమెరిగి యుండవలెను.

ముఖయంత్రములో నేర్పడు సర్వ భాషా సామగ్రికి ధ్వని ప్రాతిపదిక. దీనికి నాదము ముడిపదార్థము. ఊపిరి తిత్తులనుండి వచ్చుగాలి, గొంతులోని నాద తంత్రులపై ప్రసరించుటవలన నాదమేర్పడును. ఉచిత ప్రయత్నము చేసి, ఈ నాదమును ముఖయంత్రములో ధ్వనులుగామార్చుకొందుము. అట్టి ప్రయత్న ప్రభావమున ముఖయంత్రములోని యవయవములలో పరస్పర సంబంధము లేర్పడును. "ప" పలికి చూడుడు. క్రింది పెదవి, పై పెదవిని పూర్తిగా తాకుచున్నది. వీనిలో స్పృశింపబడు పై పెదవి స్థానము; స్పృశించు క్రింది పెదవి కరణము; తాకు వ్యాపారము ప్రయత్నము. ప్రతిధ్వని యొక్క నిర్మాణమునందును నిట్లే స్థాన, కరణ, ప్రయత్నములు నిర్ణయింపబడి యున్నవి. ఉపాధ్యాయుడు వానిని బాగుగా నెరిగి, బాలుడు తప్పుగా నుచ్చరించినప్పుడు స్థాన

కరణాదుల లోపములను గమనించి, ఉచిత రీతిని వానిని సవరించిన, బాలుని యుచ్చారణము స్పష్టపడును.

మాట్లాడునపు డుపయోగపడు అవయవములన్నియు నోటియందే (నాలుక మొదటినుండి క్రింది పెదవివరకు, దాని మీది భాగమంతయు, పై పెదవి వరకు) యున్నవి. స్థానములన్నియు పై భాగమునందు, కరణములన్నియు క్రిందయుండుట గూడ గమనింపుడు. క-చ-ట-త-ప. అను అక్షరముల నుచ్చరింపుడు. అప్పుడు మృదు తాలువు, కఠిన తాలువు, మూర్ధము, దంతమూలము, పై పెదవి వరుసగా స్థానములగుచున్నవి; నాలుకయొక్క మూలము, మధ్యము, ఉపాగ్రము, అగ్రము, క్రింది పెదవి వరుసగా కరణములగుచున్నవి. వీని నుచ్చరించుటలో స్థానకరణములకు సంపూర్ణ స్పర్శ యేర్పడుట వలన నిచ్చటిదానికి స్పృష్ట ప్రయత్నమని పేరు. కనుకనే వర్గాక్షరములకు ( 'క' నుండి 'మ' వరకు ) స్పర్శములని పేరు. అంతస్థముల (య, ర, ల. వ) నుచ్చరించుటకై ఈషత్ స్పృష్ట ప్రయత్నమే చేయుదుము. ఊష్మములలో 'హ' యొక్కయు, అచ్చులలో 'ఋ, ౠ, ఌ, ౡ, అం,' లకు భిన్నములైన వాని యొక్కయు పలుకుబడిలో చేయు ప్రయత్నమును వివృతమందురు. (అవయవము లొకదాని నుండి యొకటి విడియగుట) 'శ, ష, స, ఋ, ౠ. ఌ, ౡ'లకు ఈషత్ స్పృష్ట ప్రయత్న మాచరణలో నున్నట్లు పాఠకులు గ్రహింతురు,

అచ్చులలో 'అ-ఆ' లకు మాత్రము సంవృత ప్రయత్నము చెప్పబడినది.

పైనచూపినస్పృష్టము, ఈషత్ స్పృష్టము, వివృతము, సంవృతము అను నాల్గింటికి అభ్యంతర ప్రయత్నములని పేరు. జిహ్వామూలమునుండి పెదవుల వరకు గల వక్త్రభాగము వక్త్రాభ్యంతరభాగమగుట వలన, నా భాగములోజరుగు ప్రయత్నము నభ్యంతర ప్రయత్నమందురు. దీనికి బహిర్భాగమున (గొంతు లోపల) జరుగు దానికి బాహ్య ప్రయత్నమని పేరు. అది వివారము, సంవారము, శ్వాసము, నాదము, ఘోషము, అఘోషము, అల్పప్రాణము, మహాప్రాణము, ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము అని 11 విధములు. వీనికి స్థాన కరణములతో వంతగాబని లేనందున నుచ్చారణ దిద్దుబాటులో నుపాధ్యాయున కంతగానుపకరింపవు. వానిలోను అల్పప్రాణ, మహాప్రాణములవంటి వాని కర్థము స్పష్టమే.

స్థాన, కరణ, ప్రయత్నముల విషయములో బహు మతములును గలవు. తెనుగునందలి అన్ని వర్ణములకు స్థాన కరణ ప్రయత్నము లీక్రింది పట్టికలో నీయబడినవి. సులభముగ నుండుటకై వానిలోని స్వల్ప భేదములు విసర్జింపబడినవి.

| ధ్వనులు | స్థానము | కరణము | ప్రయత్నము |
|---|---|---|---|
| క వర్గము | మృదుతాలువు | జిహ్వామూలము | స్పృష్టము |
| హ—ః | ,, | ,, | వివృతము |
| ఆ—అ | ,, | ,, | సంవృతము |
| చ వర్గము | కఠినతాలువు | జిహ్వామధ్యము | స్పృష్టము |
| య—శ | ,, | ,, | ఈషత్ స్పృష్టము |
| ఇ—ఈ—ఎ—ఏ | ,, | ,, | వివృతము |
| ట వర్గము—ళ | మూర్ధము | జిహ్వోపాగ్రము | స్పృష్టము |
| ఋ—ౠ—ర—ఱ—ష | ,, | ,, | ఈషత్ స్పృష్టము |
| త వర్గము | దంతమూలము | జిహ్వాగ్రము | స్పృష్టము |
| ౘ—ౙ—ఌ—ౡ—ల—స | ,, | ,, | ఈషత్ స్పృష్టము |
| ప వర్గము | పై పెదవి | క్రింది పెదవి | స్పృష్టము |
| ఉ—ఊ—ఒ—ఓ | ,, | ,, | వివృతము |
| వ | పై దంతాగ్రము | ,, | ఈషత్ స్పృష్టము |

ఐ = అ + ఇ; ఔ = అ + ఉ; అం = అ + మ్; క్ష = క + ష—

వర్గ పంచమములకు నాసికనుకూడ స్థానముగా గ్రహింపవలెను.

— పరిశీలనాంశములు —

(1) భాష కుచ్చారణముయొక్క ప్రాముఖ్యమెట్టిది ?

(2) బాలుర యుచ్చారణమును దిద్దుట కుపాధ్యాయున కెట్టిజ్ఞాన మవసరము ?

(3) బాలురకొన్ని సామాన్యమైన యుచ్చారణ లోపములను పరిశీలించి, అందలి ధ్వనుల స్థానకరణములను వివరింపుడు.

(4) ఆయా వర్గాక్షరముల పలుకుబడి కుపయోగించు స్థానకరణములతో నుచ్చరింపబడు అచ్చులను క్రమముగా వివరింపుడు.

## 10. లేఖనబోధనము

పఠనము సబ్దాంశము, లేఖనము కారకాంశము. మొదటిదానికన్న రెండవది కష్టతరము; బాలురకంత యాకర్షణీయముగకూడ ఉండదు. వ్రాయుట కక్షరముల మానసిక చిత్రము లావశ్యకముకూడ; అవి పఠనములో నేర్పడును. ఈ కారణములవలన పఠనము తరువాతనే లేఖనమును బోధింపవలెనని చాలమంది విద్యావేత్తల మతము.

లేఖన వ్యాపారమందలి వివిధావస్థలను పరిశీలింపుడు. మునుముందుగా లేఖనోపకరణమును పట్టుకొను తీరెరుగవలెను, దానిని చూపకయే వ్రాయుటకు నియోగింపబడిన,

సాధారణముగ బాలురు తప్పుతీరు నభ్యసించి, యా వజ్జన్మము కష్టపడుటయేగాక లేఖనరమ్యతను బోగొట్టుకొందురు.

శిక్షణలేనిపిల్లలు నడిమిప్రేలి తుదికణుపుపై యుపకరణము నానింతురు. ఆ భారమువలన నరములయొత్తిడి యేర్పడి, యల్పకాలములోనే తలనొప్పి కలుగును. లేఖనమే వృత్తిగా గలవారట్టి చెడ్డతీరున దినమంతయు వ్రాయుచుండిన వారి యారోగ్యము చెడును. నడిమిప్రేలు కాయకాచిపోవును.

ఉపకరణమును బొటనవ్రేలితోను, నడిమిప్రేలితోను నర చేతిపైవునుండి పట్టుకొని, పైనుండి చూపుడువ్రేలి సహాయ మీయవలెను. అప్పుడు కలము వ్రేళ్ళ లోపలభాగమందున్న మాంసపుదిండ్లపై ఆని, సౌకర్యవంతమైన పొందిక యేర్పడును. ఎంతసేపు వ్రాసినను సహజమైన అలసటకుమించిన భార ముండదు.

చేతిపొందిక యేర్పడినపిమ్మట త్రాత కనుకూలించు నట్లు ధారాళముగ కలమునుత్రిప్పు అభ్యాసము కావలెను. దీనికై సరళ చిత్రలేఖన ముత్తమమార్గము. ఆకర్షణీయమైన రంగుకణికలతో నల్లబల్లలమీదను, అట్టలమీదను వ్రాయుట పిల్లలకెంతయో ఆనందదాయకము. ఈ యుపాయమువలన లేఖనబోధనము లీలాప్రాయమగును. కొంతకాలము చిత్రలేఖనము సాగించుటవలన లేఖన సంబంధమైన నాడీమండల మభ్యాసపడి సమన్వయము పొందును.

వీనితోపాటు అక్షరముల కట్టుమార్పులు, గరుసుకాగితముల అక్షరములు మొదలగువానిని దిద్దింపవలెను. వాని

పరిభావమున చదువనేర్చినదానిని వ్రాయుటకై పిల్లలు సహజ కుతూహలము చూపుదురు.

ఇదే కాలములో వ్రాయునపుడు పుస్తకమును పట్టు కొనుతీరు, పుస్తకమునకును కంటికిని ఉండవలసిన దూరము, కూర్చొనురీతి, బొమలు ముడివైచి క్లేశపడకుండ ప్రశాంత ముగ నుండుట మొదలగునవన్నియు సరిచూడవలెను.

—• పరిశీలనాంశములు •—

(1) పఠన లేఖనములలో దేనిని ముందు బోధింపవలెను ? ఎందుచేత ?

(2) లేఖనవ్యాపారమందలి వివిధావస్థలేవి ? వానికుచిత శిక్షణ నిచ్చుటెట్లు ?

(3) వ్రాతకు మిక్కిలి యనుకూలమైన పొందిక యేది ? సామాన్యముగ నేర్పడు తప్పు పొందికయేది ? అది యేర్పడిన పిమ్మట దానినెట్లు సవరింతురు ?

(4) వ్రాతబోధనలో చిత్రలేఖన మెంతవరకు సహాయ పడును ?

(5) లేఖనబోధన కనుబంధముగ సరిచూడవలసిన ఇతర విషయములేవి ? వానిలో లోపములేర్పడిన బాలుర నెట్లు దిద్దవలెను ?

(6) ఒక లిఖిత రచన కాలమున బాలుర ముఖములు, వారు కూర్చొను తీరులు పరిశీలించి కావలసిన సూచ నలను వివరింపుడు.

# 11. ప్రాథమిక విషయముల పరస్పర సంబంధము—తెనుగు, ఇతర విషయములు

పిల్లలు క్రమముగ బెరుగుచు నింద్రియముల ద్వార వివిధాంశముల జ్ఞానమును సంపాదింతురు. కొంతభాష, భావ రాశి యేర్పడిన తరువాత నీ జ్ఞానసంపాదన మింద్రియముల ప్రత్యక్షానుభవము లేకయే, వారి వారి జీవితపు టక్కరలను బట్టి, జీవితప్రవాహమువలెనే సహజముగ సాగును. వారు నేర్చు అంశములను శాస్త్రదృష్టితో బరిశీలించినచో నెన్నియో విషయములకు సంబంధించి యుండును. కాని, వారికా యెరుకయే యుండదు.

పిల్లలు మొట్టమొదట బడికి వచ్చుసరికి విషయ విభాగ జ్ఞానశూన్యులు గదా. అందువలన పాఠశాలలో జేరిన కొంత కాలము బోధన జీవితము నందువలెనే నిర్విఘ్నంఛనముగ సాగుట చాల వాంఛనీయము. కనుకనే ఏకోపాధ్యాయ తరగతులు పూర్వప్రాథమిక దశలో బోధన కుత్తమ వాతావరణమును స్థాపించును.

క్రమముగా పై తరగతులకు పోయిన విషయవిభాగము, కాలనిర్ణయము ఏర్పడును. ఇవి రెండును నిర్వహణ సౌక ర్యము కొరకేర్పడినవే; అంతమాత్రమున వివిధవిషయముల మధ్యగల సహజసంబధము నశింపదు. జ్ఞానముకూడ జీవితము వలె నఖండప్రవాహమే. అనేకముఖముగ వృద్ధిపొందు

జ్ఞానమునకు వివిధవిషయములు పోషకములుగానుండు ముడి పదార్థములవంటివి.

మనమాహారముగా గ్రహించు వివిధ పదార్థముల నుండి, వాని భౌతికస్వభావమున కతీతమైన జీవశక్తి యుత్పన్నమగును. అట్లే, వివిధవిషయములందలి యంశముల కతీతమైన జ్ఞానతేజస్సు నుద్దీపింపజేయుటయే బోధన యొక్క లక్ష్యము. అట్టిబోధనయే మూర్తిత్వవికాసమును సాధించి విద్యయొక్క పరమలక్ష్యమును నెరవేర్చును.

ఇట్టి లక్ష్యసాధన ప్రణాళికయందలి వివిధవిషయముల మధ్య నున్న సహజపరస్పర సంబంధమును పాటించి బోధించి నప్పుడే సిద్ధించును. వివిధవర్ణముల సన్నికర్షణమువలన నేర్పడు తేజోవంతమైన చిత్రమువలె, వివిధ ధ్వనుల సంయోగమున సిద్ధించు మధురస్వరమువలె, వివిధ విషయముల సంబంధ ఫలితముగా బాలుర మూర్తిత్వములను ప్రకాశింపజేయు వర్చస్సు సంక్రమించును.

బోధనలో నీ సంబంధమును విస్మరించుటవలన విద్యకు పరమలక్ష్యమైన మూర్తిత్వవికాసము కూడ దృక్పథము నుండి జారును. అప్పుడు నిర్జీవములైన యంశములే ప్రధానములగును. పరీక్షల పలవరింతలలో బాలురాయంశములలో ముఖ్యాముఖ్యములను నిర్ణయించి, కొన్నిటిని కంఠస్థము చేయుదురు. తాత్కాలిక ఫలితము స్మృతిపై భారము; దీర్ఘకాలమున నదికూడ విస్మరింపబడును.

పాఠశాలయందలి అన్నివిషయములకు భాష పునాది. భాషాసాధనము పరిపక్వము కానిదే ఏవిషయము నందును జ్ఞానసముపార్జనకై బాలునకు మార్గమే లేదు.

## భాష–చరిత్ర

చరిత్ర జీవితమంత విశాలమైనది. మానవగాథలోని మిట్టపల్లములన్నియు చరిత్రయందు చిత్రింపబడును. సాహిత్యము వీనినుండి రసవద్భాగ్యములను మాత్రము స్వీకరించి, వానిని సుందరకావ్యములుగా మార్చును. ఈవిధముగ సాహిత్యమునకు చరిత్ర ముడిపదార్థ మగుచున్నది.

అనేక వాఙ్మయములలో తొలుదొల్త సాహిత్యమునకును, చరిత్రకును భిన్నశరీరములు లేవు. మనపురాణము లట్టి మిశ్రమసంపత్తియే. ఈవిశేష మీరెండు విషయములకును గల సహజసాన్నిహిత్యమును చాటుచున్నది.

మంచియుపాధ్యాయుల చేతిలో చరిత్ర, భాష పరస్పర పోషకములై బోధింపబడును. సాహితీక్షేత్రమున మొలకెత్తిన చారిత్రకాంశములు బాలుర చరిత్రజ్ఞానమునకు పుష్టి నిచ్చును; చారిత్రకక్షేత్రమున వర్ధిల్లిన సాహితీవల్లరులు, బాలుర సాహిత్యసేవకు మానవాభిరుచిని చేకూర్చును.

## భాష–చిత్రలేఖనము

లేఖనబోధన సందర్భమున చిత్రలేఖనమునకు భాషాబోధనతోగల సంబంధము కొంత చూచితిమి. శబ్దసంపత్తిచే

ఛాయామాత్రముగ గ్రహింపబడిన భావములు చిత్రలేఖనముయొక్క సహాయమువలన సాకారరూపరేఖలతో వర్ధిల్లి బాలురకు జీవితమంత సుస్పష్టమగును. కొన్ని క్లిష్టభావముల లోని కాఠిన్యము శబ్దములతో వివరించినకొద్ది శ్రావణమేఘములవలె సాంద్రమై, చిత్రసహాయమును పొందినంతనే పటాపంచలగును. పఠనపుణ్యములేనివారు గూడ చిత్రమును గ్రహింపగలరు. చిత్రము లోకవంక వివరణ సౌలభ్యమును, మఱొకవంక సౌందర్యానుభూతిని ప్రసాదించును.

చిత్రసహాయమున రచనసాగించుట భాషాబోధనలో నొక విశిష్టవిధము. చిత్రములను శాబ్దికచిత్రములుగను, శాబ్దికచిత్రములను చిత్రములుగను మార్చుట బాలుర కెంతయో యుత్సాహమునిచ్చును. ప్రాథమికదశలో నీరెండు విషయముల సంబంధము నిరంతరము కనబడును. ఇట్లే భూగోళశాస్త్రము, విజ్ఞానశాస్త్రము, గణితము మొదలగు వానితోగూడ భాషకెంతయో సంబంధమున్నది.

## —, పరిశీలనాంశములు. ,—

(1) బోధనలో వివిధ విషయముల మధ్యగల పరస్పర సంబంధమును పాటించుట వలని లాభనష్టములను విశదీకరింపుడు.

(2) సంబంధము పాటించు బోధన కిచ్చిన యుపమానము లేవి ?

(3) భాషను చరిత్రను సంబంధ పరచి బోధించుట యెట్లు, ఎందుకు?

(4) భాషకును, చిత్రలేఖనమునకును మధ్య సంబంధమును బోధనలో పాటించుట యెట్లు?

---

# 12. గద్యపద్యములు

నిత్యవ్యవహారమంతయు వచనములో సాగించుట, నిర్విచార సమయములలో నప్రయత్నముగ కూనరాగములు తీయుట మన యందరి యనుభవములోనిదే కదా, ఈరెండంశములు గద్యపద్యముల స్వభావమును సూచించును. విషయప్రాధాన్యము కలిగి, స్పష్టమైన జీవిత వ్యాపారములలో వినియోగించునది గద్యము; భావప్రాధాన్యము కలిగి, కేవలము ఆనందమునకు మించిన ప్రత్యక్ష లక్ష్యములేనిది పద్యము. గద్యముపకరణము వంటిది; పద్యమాభరణము వంటిది.

మానవునకు తొలుదొల్త యబ్బిన భాషారూపము గద్యమేయని యూహింప నగును. కాని అన్ని భాషల వాఙ్మయములందును పద్యమే ప్రాచీన రూపమని చూచుచున్నాము. ప్రాచీన మానవుల నిత్యకృత్యములోని నిరలంకృత వచనమునకు భద్రతా యోగ్యత లేదేమో. కాని, శబ్దభావముల సౌందర్యముచే హృద్యమై, పద్యము స్మృతి యోగ్యముగా గుర్తింపబడినదని మన మూహించుట సులభము. గ్రంథస్థము కాని జానపద వాఙ్మయము పల్లెవాసుల నెట్లానంద మయు

లను చేయుచున్నదో గమనించిన యెడల మనకిది సులభముగ స్పష్టమగును.

ఇప్పుడు బోధన దృష్టితో నీ రెండింటి స్వభావమును పరిశీలింతము: గద్యబోధన కంశము లక్ష్యము; పద్యబోధన కానందము లక్ష్యము. అంశము శబ్దార్థము నాశ్రయించి యుండును కనుక వచనములో శబ్దార్థము ముఖ్యమైనది; పద్యములో భావస్ఫురణ ముఖ్యమైనది. వచనమందలి శబ్దములు బేహారుల కొలపాత్రలవలె యర్థమును తూచినట్లు పరిమితముగ పొందుపరచును. మరి పద్యమునందలి శబ్దము లమృతకరుని వెలుగు రేఖలవలె, ఆషాఢమేఘముల మెరుపు జలతారులవలె, సాయమ విహంగముల హేలవలె అనంతమైన, అవ్యక్తానుభూతికి చిహ్నములుమాత్రమే. కనుకనే విషయ ప్రాధాన్యముగల శాస్త్రములు గద్యమును, రసప్రాధాన్యముగల కావ్యసృష్టి పద్యమును సాధనముగా గ్రహించును. ఖనిజసంపదను సాధించినట్లు గద్యాంశమును శ్రమించి సాధింపనగును. పద్యానుభూతి కనుభూతియే మార్గము, ప్రమాణము కూడ. గద్యము విశేషించి ధీసంబంధమైనది, పద్యము హృత్సంబంధమైనది. ఈ స్వభావ భిన్నత్వ కారణముగా, గద్య పద్యముల బోధనలోకూడ భేదమును పాటించుట సహజము.

ఇంతవరకు గద్యపద్యములను గురించి స్థూలముగ చూచితిమి. వాని ప్రత్యేక బోధన పద్ధతులను వివరించుటకై భాషాబోధన లక్ష్యములను మరొకమారు పరిశీలింపవలెను. ఆ సందర్భమున భాషను, సాహిత్యమును భిన్నముగ పరి

శించితిమి. సాహిత్య సాధనకు భాషాభిజ్ఞత పునాది యని కూడ చూచితిమి. భాషలో శబ్దరాశి, వాక్యప్రణాళిక, కూర్పు కుశలత ముఖ్యము. బాలురకు వీనిని స్వాధీనము చేయుటకు గద్యమే యుచిత సాధనము కనుక ఈ యంశములు గద్యబోధనలో, ముఖ్యముగా పాఠశాలదశలో, నొక ముఖ్యలక్ష్యము. వీనితో ముడివడి, పాఠానుబంధమైన శాఖావాఙ్మయమునం దభిరుచి వృద్ధి మరొక ముఖ్య లక్ష్యము. గద్యము విషయ ప్రధానమైనది గాన, పాఠమందలి విషయ సంగ్రహణము మరొక లక్ష్యము. ఐతే సాహిత్యము, జీవితమునంతయు నావరించియుండుట వలన, నితర శాస్త్రములందు వలె నిర్దిష్ట విషయమందు లేదు. కనుక గద్యమందు బోధించు ప్రతివిషయము జీవితానుబంధమై బాలుని జ్ఞానవృత్తమును ప్రవేశించి యతని మూర్తిత్వమును శక్తివంతము చేయవలెను. దీనిని వెన్నంటి జ్ఞానమున కతీతమైన చిత్తసంస్కారముండును. దీనిని సాంస్కృతిక లక్ష్యమన వచ్చును. ఈవిధముగ సమగ్రముగ బరిశీలించిన గద్యబోధనకు భాష, సాహిత్యము, సంస్కృతి, అంశము అను వానికి సంబంధించిన చతుర్విధ లక్ష్యములు బోధకుని దృష్టియందు నిరంతరము సజీవముగ బ్రకాశింపవలెను.

ఆధునిక సాహిత్యములో విషయ వివరణకు మించి, ఉత్తమ పద్యమున కుద్దియగు రసమయ గద్యసృష్టి యొక కళయైనది. అట్టివానిలో భాష, అంశమునకు సంబంధించిన లక్ష్యములు సన్నగిల్లి పద్యమునందువలె మిగిలినవి ప్రధానమగును.

కనుక లక్ష్యనిర్ణయమెప్పుడును యాంత్రికముగ జరుగరాదు. ఆయా పాఠములబట్టి జరుగవలెను.

పద్యమానంద ప్రధాన సాహిత్య విశేషము గదా. కావ్యానందమును రసమందురు. కనుక రసానుభూతి పద్య బోధన యొక్క ముఖ్య లక్ష్యము. దానిలో శబ్దాదు లప్రధానము లగుటవలన, వచనములో భాషాలక్ష్యము యొక్క స్థానమును పద్యములో రసానుభూతి కీయవలెను. మిగిలిన వానిలో సాహిత్యము, సంస్కృతి పద్యబోధనలో ద్విగుణీకృత ప్రాముఖ్యము వహించును. భావౌన్నత్య మంశముతో ముడి పడి యుండునంత వరకు అంశమునకు కూడ ప్రాధాన్య మున్నది.

గద్యమునందు సాహితీ సాంస్కృతిక లక్ష్యములను విశాలోద్దేశములుగను, భాషాంశములను ప్రత్యేకోద్దేశములుగను, గ్రహింపవలెను.

## అ — గద్య బోధనము

బడికి వచ్చిన మొదటి సంవత్సరము వాక్యపద్ధతిని బాలురు ధారాళముగ చదువుట నేర్తురు. ఆపైన వాచకముల సహాయముతో గద్యపద్యముల బోధన సాగును. ఇది ఒక పద్ధతి ననుసరించి సాగిన యెడల సాధారణ ప్రతిభగల యుపాధ్యాయుడుకూడ సులభముగ బోధింపగలడు. తరగతి బోధనకు పద్ధతి, అగమ్యారణ్యమునకు రాచబాట వంటిది.

సమయోచితముగ నీపద్ధతిని వినియోగించుకొను నుపాధ్యాయునకు తన పని యెంతయో సుగమమగును.

శిక్షణలేని యుపాధ్యాయులు సామాన్యముగ వచనమును బోధించు విధము కొంచెము పరిశీలింపుడు. పాఠము తెరచి చదువుచు, కఠినపదముల కర్థములు చెప్పుచు, అక్కడక్కడ భావ వివరణము చేయుచు పోవుదురు. మాతృభాషలో నాయర్థములను నల్లబల్లపై వ్రాయు అభ్యాసము కూడ తక్కువ. శబ్దప్రయోగము పరీక్షపత్రములలో తప్ప యుండదు. కనుక బాలుని శబ్దరాశి యాదృచ్ఛికముగ నెంత వృద్ధియగునో నంతేకాని, దానికై ప్రత్యేక శ్రద్ధ లేదు. అర్థ వివరణము, భావవివరణము కలిసి సాగుటలో నభిరుచి ఛిన్నాభిన్నమై, దేని పైనను అవధానము కేంద్రీకరింపదు. మధ్య మధ్య నానార్థ పర్యాయపద వ్యుత్పత్త్యర్థములు, పూర్వగాథలు, వ్యాకరణ విశేషములు వచ్చి, పాఠవిషయ మందలి భావసూత్రము చిందరవందరయై పోవును. ముఖ్యాముఖ్యములను నిర్ణయించుకొనలేని బాలు రేది పాఠాంశమో, ఏది యానుషంగికమో తెలియక యుక్కిరిబిక్కిరియగుదురు. పాఠమంతయు నుపాధ్యాయుడే సాగించుట వలన బాలురు చాలవరకు స్తబ్ధముగనేయుందురు. ప్రతిభ, గాత్రము, పాండిత్యము గల యుపాధ్యాయుడైన పురాణ కాలక్షేపము వలె పాఠము రక్తికట్టును గాని, భాషాపరముగ లాభము తక్కువ.

ఇక పద్ధతి ఈ పరిస్థితి నెట్లుమార్చునో చూతము: బోధనీయమైన ప్రతియంశము ముందుగనే యుపాధ్యాయుడు

నిర్ణయించుకొనును. ఎంతటి పండితుడును ఈపని చేయక తప్పదు: నిర్ణీతకాలములో నిర్ణీతపాఠములను ముగించుటకైనను దీనియక్కర కలదు. బోధనలో ప్రతియంశమును ప్రత్యేకింపబడి, ఒక క్రమములో ప్రదర్శింపబడును. దీనివలన పాఠమందలి వివిధాంగములు స్ఫుటముగ గోచరించును; బాలురు వానిననుసరించుట సులభమగును. వీలగునంతవరకు అంశమును ప్రదర్శించుటలో బాలురకృషి గ్రహింపబడును. అందువలన వారెప్పుడు స్తబ్ధముగానుండక ప్రతియంశమును నభ్యసింతురు.

ప్రతి పాఠమునకును ప్రవేశము, ప్రదర్శనము, పునర్విమర్శనము అను మూడు ముఖ్యసోపానములుండును. ప్రవేశమును పరిచయసోపాన మనవచ్చును. క్రొత్తగ నొకచోట కూడిన పెద్దమనుష్యు లొకరినొకరెరుగకుండ ఎట్టిసంభాషణమును సాగించుకొనలేరుకదా. అట్లే పాఠముకూడ. పిల్లలకేది బోధించినను వారికిదివరకు తెలిసినదాని సహాయముతోనే చేయవలెనుకదా. అట్లుకాకున్న వారికర్థమేకాదు. నూతనాంశమునకు సంబంధించిన ప్రాచీన సంస్కారములను ప్రజ్వలింపజేసిన వారాసక్తితో నభ్యసించి, సులభముగ గ్రహింతురు. పాఠ పరిచయముతోపాటు పాధ్యాయుని పరిచయము కూడ పరోక్షముగ సాగును. ప్రాతవాడైనను, ఆనాటిపాఠమెంతవరకు జయప్రదమానో ప్రవేశ సోపానములో తేలిపోవును. సున్నిత బోధనవ్యాపారమునకు కావలసిన సుముఖవాతావరణముకూడ ఈ సోపానమునందే యుత్పన్నమగును.

పిమ్మట ఉద్దేశప్రకటనముచేసి, శీర్షికను నల్లబల్లపై వ్రాసి, పాఠభాగము నుపాధ్యాయు డుచితముగ చదువవలెను. ఇందు అంశములో సాధ్యమైనంతవరకు ఐక్యత యుండవలెను. బాలు రా యైక్యతను గమనించి, కొండగుర్తువలె స్థూల భావమును గమనించి, క్రమముగా వివరములను గ్రహింతురు. పఠనస్వరము తరగతి సంఖ్యకు చాలినస్థాయిలో నుండవలెను. ఉచ్చారణ, కాకువు, విరామము, భావము, ఉదాత్తత మొదలగు ధ్వనివిశేషములన్నియు నప్రయత్నముగ ప్రదర్శింపబడవలెను.

మనభాషలలో సంధికార్యము పఠనములో చిత్రవిచిత్రమైన వైపరీత్యములను స్థాపించుట, అన్నిదశల యభ్యసనపాఠములందును గమనించితిని. కనుక దానినిగురించి కొంత వివరింతును.

చిన్నతరగతులలో వాచకములు విసంధిగనే వచన పాఠములను ప్రదర్శించును కనుక వచనపాఠములో నాతరగతుల యందాసమస్యయే లేదు. పైతరగతులలో సంధియో, విసంధియో, పుస్తకములో నున్నదియున్నట్లు వినిపించుట పాఠకుని ప్రథమధర్మముకదా. కనుక యుపాధ్యాయుని పఠనములో సంధియున్నపట్ల నెల్ల దానిని పాటించవలెను. అట్లు చేయక సంధి విడదీసి చదివిన నేమగునో కొంచెము పరిశీలింపుడు. బాలునకు పాఠములో కనబడునదొకటి, యుపాధ్యాయుని నోటవినబడున దొకటి యగుటవలన రెండింద్రియముల యనుభవముమధ్య వైరుధ్య మేర్పడుచున్నది. విధ్య

కింద్రియముల పరస్పరసహకారము బలమును, వైరుధ్యము దానికి వ్యతిరేకమును కలిగించునుకదా. సంధి, బోధింపవలసి నంతకష్టమైనదైన దానిని ప్రత్యేకముగ గ్రహించుట లాభ కారి కాని, యుపాధ్యాయునికి తోచినచోట విరిచి, లేనిచోట యూరకుండుట వివేకమైనదికాదు-అన్నిటికన్న ముఖ్యమైనది, సంధి మనభాషకు సహజవికాసమే కాని, తెచ్చిపెట్టుకొనిన వికారముకాదు. ఐతే, సహజ, సరళభాషావ్యవహారములో నాధునికు లభిరుచినిబట్టి కొన్నిపట్ల విసంధిగ వ్రాయుచున్నారు. దాని కెట్టియభ్యంతరములేదు. కాని, పఠనములోసంధియున్న చోట్ల విసంధి పాటించిన మరొక నష్టమున్నది: మనభాషలో సహజముగ నేర్పడిన సంధిని నేర్పుతో పాటించి పూర్వపర శబ్దముల భావము పోషించుట నేర్పవలెను. కాని, ఆకష్టమును మరుగుపెట్టరాదు. ఉచితమైన యూనికతో సంధిస్థానమును పలుకనేర్చుట మన భాషావ్యవహారములోని మెలకువులలో ముఖ్యమైనది. పద్యములో విసంధి పాటించిన ఛందోగమ నము కుంటువడును గనుక, అచట సందేహమేలేదు.

వచనపాఠములో నుపాధ్యాయు డొక్కసారి చదివిన చాలును. ఇక పిల్లలపఠనము. ఉపాధ్యాయుని వెనువెంటనే చదువుట వారి పఠనమునకు సహాయకారి యగును. కాని, అట్టిది పఠనపాఠమగును కాని, భాషాపాఠముకాని, సాహిత్య పాఠము కాని కాజాలదు. మాధ్యమిక దశనుండి పాఠాంతమున బాలురు చదివిన చాలును. తరగతియందలి బాలురందరికిని పఠనపాటవము బాగున్నప్పు డుపాధ్యాయుడొక్కమారుకూడ

చదువుట మాని, బాలురచే జదివింపవచ్చును. ప్రాథమిక దశలో, ముఖ్యముగ పూర్వప్రాథమిక దశలో, ఉపాధ్యాయుని తరువాత ముగ్గురు నలుగురు బాగుగ చదువు బాలురచే చదివించు టితరుల పఠనమునకు దోహదమగును.

పఠనమైనపిమ్మట పాఠమందలి శబ్దకాఠిన్యము దొలగించుటకు గడగవలెను. దానివలన యాంత్రికప్రతిబంధనములు తొలగి, భావానుబంధమైన చర్చ నిరాటంకముగ సాగును. ఈసందర్భమున కూడ మనసంధివలన నాంగ్లాదులందులేని యుపసోపానమొకటి మనము కల్పించుకొనవలసి యున్నది. శబ్దమేదియో బాలుడు గుర్తించినప్పుడుకదా దాని యర్థసంగ్రహణమునకై ప్రయత్నించుట. సంధిప్రభావము వలన శబ్దరూపమే మరుగుపడును. 'గంగోదకము' 'శైలోపరితలము' 'సచ్ఛీలము' మొదలగువానిని చూడుడు. సంధి విడదీసిన వీనిలో కొన్నిటికైనను రెండుమూడు తరగతుల పిల్లలు కూడ అర్థములు చెప్పగలరు—కనుక అర్థసంగ్రహణమునకు ముందు, శబ్దరూపనిశ్చయమునకై విగ్రహసోపానమగత్యము. ఐతే అక్కరయున్నను లేకున్నను నీ లాంఛనమును పాటించుటకు సులభమైన సంధులను విడదీయించి, పిల్లలకాలము వ్యర్థము చేయరాదు.

విగ్రహముతరువాత పాఠమందలి కఠినశబ్దముల యర్థబోధన చేయవలెను. ఆయా పాఠములందలి భావమును గ్రహించుటయేకాక బాలుర శబ్దరాశిని వృద్ధిచేసి, వాని ప్రయోగదక్షత పెంపొందించుటకూడ వచనపాఠము యొక్క

లక్ష్యమే. కనుక యుపాధ్యాయు డర్థములను చెప్పుచుపోయిన చాలదు. చిన్నతనములో ప్రయోగప్రభావమున శబ్దముల యర్థములను గ్రహించినట్లే బాలురు తరగతియందుకూడ ప్రయోగమూలకముగానే యర్థసంగ్రహణము చేయవలెను. దీనికై ఒక్కొక్క శబ్దము నొక్కొక్క వాక్యములో ప్రయోగించి దాని యర్థమును సువ్యక్తముచేసి, బాలురనుండి రాబట్టవలెను. ఇట్లుచేయుటవలన అర్థముతోబాటు ప్రయోగము కూడ పిల్లలు నేర్తురు.

ఈరెండు సోపానములు యాంత్రికమైనవి కనుక ఉపాధ్యాయుడు నేర్పుతో చురుకుగ నిర్వహించినగాని విసుగు పుట్టించును. అనుభవములేనివారికివి అనవసరమైన యార్భాటమనిపించును— కాని, భవనమునకు పునాదులెట్టివో వచనపాఠమునకివి యట్టివి: ఇవి చాలవరకు భాషకును, తరువాత వచ్చు చర్చ, సాహిత్యమునకును సంబంధించినవి.

మన వాచకములలో క్రమబద్ధమైన శబ్దప్రవేశము లేనందున ఒకే వాక్యములో ననేక కఠిన శబ్దములు దొర్లుట, అనేక పంక్తులు పేలవముగ పరుగెత్తుట కలదు. ఎక్కువ శబ్దము లున్నపుడు నిఘంటువునందు వలెనే, అవియు చాల వరకు నిరర్థకమైనవే యగును. వానిలో భావమునకు ముఖ్యమైన వానిని గ్రహించి, మిగిలిన వాని నుపేక్షచేయక తప్పదు. అరగంట వచన పాఠములో ప్రాథమిక దశలో 6, మాధ్యమిక దశలో 8, ఉన్నత దశలో 10కి మించి నూతన శబ్దములను బోధించుట సుసాధ్యము కాదు.

కఠిన శబ్దములను, వాని యర్థములను నల్లబల్లపై వ్రాయవలెను. బాలురు వేగముగ వ్రాయగలిగిన తరగతులలో వారుకూడ యుపాధ్యాయునితో బాటు వ్రాసుకొనవచ్చును. అట్లు చేయుట క్రమశిక్షణకు సహాకరించును; కాలము కలిసి వచ్చును. పిల్లలుపాధ్యాయునితోబాటు వ్రాసుకొనలేని తరగతులలో పాఠాంతమున నర్థములను వ్రాసికొనుటకు ప్రత్యేక కాలమేర్పాటుచేసి, బాలుర వ్రాత నుపాధ్యాయుడు పరిశీలింప వలెను.

శబ్దకాఠిన్యము తొలగిన పిమ్మట, అర్థముల సహాయముతో పిల్లలు మానముగ పాఠము నొకసారి చదువుకొనవలెను. భావము కొరకు గనుక నీ మానపఠనమునకు తగిన వ్యవధి కావలెను. ధారాళముగ పఠింపలేని చిన్న తరగతులలో మాన పఠనము సాధ్యము కాదు కనుక నాల్గవ తరగతికి ముందిది యసమంజసమే. అట్టి తరగతులలో మానపఠనము స్థానమున ఒకరిద్దరు సమర్థులైన బాలురచే చదివింపవచ్చును. అవసరమని తోచినప్పు డుపాధ్యాయుడే ఒకసారి చదువవచ్చును.

పిమ్మట పాఠాంశమును సాంగోపాంగముగ చర్చింపవలెను. ఇచ్చట ప్రథమ ధర్మము పాఠమందలి యంశమును బాలురు యథాతథముగ గ్రహించుట, పిమ్మట దానిని విమర్శించి లోతుల నెరుగుట. ఉపాధ్యాయుని ప్రశ్నపాటవ మెంత బాగుండిన చర్చ యంత చిక్కగ సాగును. ఇచ్చట బాలుర వ్యక్తిగతమైన పూర్ణశక్తులు వినియోగ పడునట్లు చూడ

వలెను. సమయమును, అర్హతను, అవకాశమునుబట్టి చర్చతో పాటు జీవితానుభవమును జతపరుప వలెను. ఇచ్చట చాల మంది యుపాధ్యాయులు బాలురు పుస్తకములో జూచుట నిషేధింతురు. ఇది యనుచితము. స్మృతిని పరీక్షించు పునరావృత్తి పాఠములలో నట్లు చేయవచ్చును. కాని, తొలిసారి బోధించునపుడు బాలుర సంగ్రహణమునకుపకరణమైన గ్రంథ వినియోగ మవశ్యమే యగును. బోధనయొక్క లక్ష్యమభ్యసన విధానమును పిల్లలకు నేర్పి, క్రమముగా వారు స్వతంత్రముగ నూతన గ్రంథములను చదువుకొనుట. కనుక వలసినప్పుడెల్ల పుస్తకము చూచి యుచితమైన ప్రత్యుత్తరమీయ ప్రోత్సహింప వచ్చును. ఒక్కొక్కప్పుడు పిల్లలు పుస్తక వాక్యము నున్నదున్నట్లు చెప్పుదురు. అప్పుడు దానిని స్వంత వాక్యములలో చెప్ప నియోగింప వలెను. లేనియెడల ప్రశ్నయందలి ఏదో యొక శబ్దము నూతనగగొని, అదియున్న వాక్యమును యాంత్రికముగ చెప్పుదురేకాని, దాని భావమును గ్రహించరు.

ఇక మిగిలినది పునర్విమర్శనము. బోధించిన సర్వాంశములను పాఠముయొక్క సర్వలక్ష్యముల దృష్టిలోను, ఇచట పునఃపరిశీలన చేయవలెను. చర్చలో గ్రహించిన యంశములు ముడి పదార్థమువంటివి. వీనిని జల్లెడపట్టి బాగోగులు పట్టిచూచి, బాలురను జిజ్ఞాసపరులను చేయునదిచ్చట. కేవలము అంశదృష్టితో చాలమంది చర్చయందలి కొన్ని కఠినమైన ప్రశ్నల నిచ్చుట తిరిగి యడుగుచుందురు. ఇది యర్థము.

లేనిది. ఈసోపానమునందు పైన బోధించిన కొన్ని శబ్దముల ప్రయోగమును కూడ చేయింపవలెను. అన్నిటికిని స్థానము లేనందున, వేని నిచ్చట గ్రహింపవలెనో ఉపాధ్యాయుడు శ్రద్ధతో నిర్ణయింపవలెను. పఠనలో నీరసముగనున్న బాలుర పఠనాభ్యాసనమునకు కూడ కొంత స్థాన మీయవలెను. ఎంత సమర్థమైన బోధనజరిగినను, పుష్టిగ పునర్విమర్శనముసాగించక వదలిన పాఠము పొదుపులేని యార్జన వంటిది.

ఈ విధముగ బోధించిన ప్రణాళికలు పూర్తి కావని చాలమంది యభిప్రాయము. కథలుచెప్పి పుస్తకము పూర్తి చేయుట భాషాబోధనకాని, సాహితీపరిశీలనకాని కాదుగదా. క్రమబద్ధమైన బోధన కొన్ని పాఠములకు జరిగినపిమ్మట వేగ మెంతయో హెచ్చును. మాధ్యమిక తరగతులనుండి కొన్ని పాఠములు బాలురే స్వతంత్రముగ పఠించునట్లు నియోగింప వచ్చును. పద్ధతి, బోధకునకు రాచబాటయైనట్లే, విధానము విద్యార్థికికూడ ఉపకారియే.

పునర్విమర్శనములో న. బ. సారాంశమని యంశపు ప్రశ్నల ప్రత్యుత్తరములను న. బ. పై వ్రాయు సంప్రదాయ మొకటి కలదు. పద్యబోధనములో నిది తాత్పర్యరూపమును పొందును. మాతృభాషలో నిది యక్కర లేదు సరికదా హాని కరముకూడ. పిల్లలీభాగమును కంఠస్థముచేసి పరీక్షగండములు దాట యత్నింతురుకాని, బోధనపిమ్మట పాఠములనుచదివి వాని పూర్ణలాభమును పొందరు. ఆంగ్లమును పరభాషగ నభ్య సించుటలో వాక్యప్రణాళికల నభ్యసింపజేయుటలో నిట్టిదానికి

కొంత యక్కరకలదు. కాని, మాతృభాషలో నిది యనవసరము. ప్రత్యేక కాఠిన్యమున్న పాఠభాగముల కుచితమైన వ్యాఖ్యానములను ప్రదర్శనమునందే వ్రాయవచ్చును. అవి మిక్కిలి క్లుప్తముగ భావవివరణమునకు చాలినవి మాత్రముగ నుండవలెను. పాఠాభ్యసనమునకవి యుపకరణముల వలె నుండవలెనుకాని, దాని నుపేక్షించుట కుత్సహింపరాదు.

## ఆ — పద్యబోధనము

పద్యమన నెట్టిదో పైన కొంతచూచితిమి. ఆ నిర్వచనమును పాటించినచో ఈనాడు మన వాచకములలో నుండు పద్యభాగము లెంతవరకు నిలచును ? ఆంగ్లమున Poetry కి verse కు విభేదమును పాటింతురు. ఈ రెంటికిని సరియైన శబ్దములు లేకున్నను, మన ప్రాచీనులీ భేదమును చాల సునిశితముగ పాటించిరి. ఐతే గ్రంథముద్రణము లేని పూర్వకాలములో స్మృతి సౌలభ్యమునకై, ఎట్టిభావ ప్రాధాన్యము లేని గణితాదులవంటి శాస్త్రములనుకూడ పద్యరూపమున పొందుపరచుకొనుచు వచ్చిరి.

ఈనాటికిని నిరక్షరాస్యులుకూడ, శిల్పము, వైద్యము వంటి శాస్త్రాంశములకు పద్యములుచెప్పి ప్రమాణములు చూపువారిని పల్లెలలో చూతుము. అట్టివానినన్నిటిని పద్యములుగ గ్రహించుట మన యవివేకముకాని వారితప్పుకాదు.

ఆధునిక విద్యాశాస్త్రదృష్టిలో బాలవాఙ్మయసృష్టి జరగని మన భాషలలో పిల్లలకుతగిన పద్యములంతగ లేని

మాట నిజమే. అట్టికొరతను తీర్చుకొనుటకు ప్రయత్నింప వలెనేకాని ప్రబంధముల పచ్చి శృంగారమును, వేమన వేదాంతమును, భర్తృహరి వైరాగ్యమును పసివారి నెత్తిన బెట్టి యానందించుట ఆత్మవంచనయే.

పద్యబోధనలో రసానుభూతి ప్రధానలక్ష్యమంటిమి. కవి యనుభవమును బాలునికి సాక్షాత్కరింప జేయుటకై యుపాధ్యాయుడు ప్రయత్నింపవలెను. దానికి సుముఖమైన వాతావరణమును కల్పింపవలెను.

ఉచితమైన ప్రవేశము సాగినతరువాత, పద్యపఠనము జరుగవలెను. పద్యములలో శబ్దసౌందర్యమునకు విశేషస్థానమున్నది. యతిప్రాసలు, ఛందోగమనము, పదలాలిత్యము మొదలగునవన్నియు నెంతో శ్రవణసౌఖ్యము నిచ్చును. విద్యార్థులెంత చిన్నవయస్కులైన శబ్దసౌందర్యమున కంత ప్రాముఖ్యమున్నది. భాషాజ్ఞానములేని పసిపాపలుకూడ జోలపాటల మాధుర్యమున కానందించుట మనమందర మెరిగినదే. మనకు తెలియని భాషలలోనున్నను పద్యములనువిని పెద్దవారమకూడ నానందింతుము. ఈ శబ్దసౌందర్యము బాలురచే ననుభవింపజేయుటకై పద్యము నొక్కమారు వచనమునందువలె చదువుట చాలదు; ఇన్నిమారులని నిర్ణయించుటయు కష్టమే. ఒకటిరెండుమారులీ శబ్దసౌందర్యానుభూతికి, ఒకసారి భావస్ఫురణమునకు చదువుట ఆచరణయోగ్యమైన సూచన,

పద్యపఠనములో సంగీతముయొక్క స్థానమునుగురించి కూడ వాదోపవాదము లున్నవి. ఆంగ్లాదులలో పద్యపఠనములో సంగీతము నుపయోగింపరు.

ఐతే, మనభాషవలె నజంతభాషయైన ఇటలీదేశపు భాషలో పద్యపఠనము సంగీతముతో సాగునట. మనము వద్దన్నను, మనపద్యముల ఛందోగమన ప్రభావమున కొంత సంగీతపుధోరణి ఏర్పడును. మధురకంఠమున్నవారు పద్యపఠనములో దానిని వినియోగించుకొనుట సహజము సమంజసముకూడ. అది లేనివారు తమ సంగీతముతో తరగతిని వేధించుట క్రౌర్యమే. కంఠమాధుర్యము లేనివారుకూడ సాధనచే పద్యపఠనములో నాకర్షణీయమైన ఫణితిని సంపాదింపవచ్చును. ఏ ప్రాగల్భ్యము లేనివా రున్నదున్నటు భావస్ఫోరకముగ చదువుటలో న్యూనతలేదు.

ఉత్తమపద్యభాగమున నొక సహజమైన యైక్యత యుండును. ఇది భావమునందును శిల్పమునందును కూడ వెల్లివిరియుచుండును. దానిని పోషించు పూర్ణపద్ధతి పద్యబోధనకు చాల అనుకూలమైనది. పద్ధతిని పాటింపనివారు వచనమును బోధించునట్లే పద్యమునుకూడ చదువుచు నర్థభావాదుల వివరించుచు సాగుదురు. ఇది పద్యమందలి యైక్యతకు భంగము కలిగించు ఖండపద్ధతియే.

పద్యమందలి రసప్రకర్షమున కొకానొక యనుభూతి ఆయువుపట్టువలె నుండును. దానినిసూచించు స్థూలార్థమును గ్రహించిన పద్యభావమంతయు సుబోధకమగును. ఈ లాభ

సిద్ధికై పఠనముపిమ్మట పద్యమందలి స్థూలార్థమును రాబట్టుట సమంజసము. చాలమంది స్థూలార్థమునకును, తాత్పర్యమునకును విభేదము పాటింపరు. పఠనమైనంతనే పిల్లలు తాత్పర్యమును గ్రహింపగలిగిన పద్యములను వారికి బోధింప నక్కరయేలేదు. స్థూలార్థమనగా, వివరణోపమానాలంకారాదులులేని, నిరాడంబరమైన ఒకేయొక అంశము. అది పద్యమందలి రసపరికర్షణకారణమైన యనుభూతిని స్ఫురింపజేయును.

పద్యబోధనలో శబ్దవ్యాకరణాదు లప్రధానములని చూచితిమి. కనుక విగ్రహము, అర్థసంగ్రహణము మిక్కిలి పరిమితముగ నుండవలెను. శబ్దరాశి నభివృద్ధిచేయుట కూడ పద్యబోధనయొక్క లక్ష్యముకానందున బోధించు ప్రతిశబ్దమును వాక్యములో బ్రయోగింప నక్కరలేదుకూడ. పద్యములందలి శబ్దముల నన్నిటిని అట్లు ప్రయోగించుట కూడ సాధ్యముకాదు.

అనుభూతి ప్రధానమైన పద్యబోధనలో మౌనపఠన మప్రస్తుతమే. దానిస్థానమున నుపాధ్యాయుడో, బాగుగ చదువు బాలుడో బాహ్యపఠనము చేయుట చాలమంచిది.

చర్చ నిరంతరము పిల్లలయనుభూతి ప్రమాణముగ సాగవలెను. కేవలము అంశమును నిర్దిష్టముగ వివరించినంత మాత్రమున తృప్తిపడరాదు. ఉన్నత భావోన్నత్యానుభూతి పిల్లల ముఖకమలములను దీప్తివంతముచేసి తీరును.

తానాయనుభవమును పొందిన యుపాధ్యాయునకా వెలుగును గి ర్తించుట చాలసులభము.

పునర్విమర్శనములో శబ్దప్రయోగ మక్కరలేదు. సాహితీసంస్కృతుల దృష్టితో జీవితానుబంధమైన పరిశీలనము; పఠనము ఇచ్చుటె ముఖ్యవిషయములు.

గద్యపద్యములకు రెండింటికిని అనుబంధముగ వివిధ రూపముల స్వయంకృషి కల్పింపవచ్చును. అది కేవలము భాషాసంబంధమే కానక్కరలేదు. చేతిపనినుండి చిత్రకళవరకు దానిలో స్థానమున్నది. బాలుర సృజనాత్మకశక్తులను వికసింపజేయుచు పాఠాంశమును వారు పరిశీలించునట్లు చేయుటయే దాని ముఖ్యలక్ష్యము.

## పరిశీలనాంశములు

(1) గద్యపద్యముల బోధనలో వైరుధ్య మెందుకు పాటింపవలెను ?

(2) వానిలక్ష్యములందలి విభేదసాదృశ్యములను వివరించునది.

(3) గద్యపద్యముల పఠనము నెట్లు సాగింపవలెను ?

(4) పద్యపఠనమునందు సంగీతము సమీచీనమా ?

(5) పూర్ణఖండపద్ధతు లనగా నేమి ? గద్యపద్యములబోధనలో వానిస్థానమెట్టిది ?

(6) గద్యపద్యముల బోధనలో నల్లబల్లపని యెట్లుండవలెను?

(7) పఠనములో విసంధిపాటించుట సమంజసమా ?

(8) "పద్ధతి బోధకునకు రాచబాట యైనట్లేవిధానము విద్యార్థికికూడ యుపకారియే" అనుభావమును గద్య పద్యముల బోధనపరముగా వివరించునది.

(9) "వచనమందలి శబ్దములు......అర్థమును తూచి నట్లు పరిమితముగ పొందుపరచును; మరిపద్యము నందలిశబ్దములు......అనంతమైన అవ్యక్తానుభూతికి చిహ్నములుమాత్రమే." ఈ వాక్యార్థమును విపు లీకరించి, విమర్శించునది.

(10) గద్యపద్య పాఠముల పథకములను వివరించి, అందలి భేదములపై వ్యాఖ్యానించునది.

---

## 13. రచన

భాషకు భాషణము సహజరూపమనియు, లేఖనము నియొక్క ప్రతిబింబమేయనియు చూచితిమి. రచనలో లుని భాషాకారకశక్తులన్నియు కేంద్రీకరించును. కనుక నే భాషా ర్హతను పరీక్షించి, వారికి భాషపైగల యధికా నిర్ణయించుటకై వారిరచనశక్తిని పరీక్షింతుము.

ఐతే రచనశక్తి యనునదొకటి ప్రత్యేకముగ లేదు: లుని సర్వభాషాకృషి ఫలితముగ లభించు భావపుష్టి, పాసరళతయొక్క సమ్మిళితభాషాసామర్థ్యమే రచన. అందు లన రచనను ప్రత్యేకించి బోధించుట సమంజసముకాదని యభిప్రాయము.

ఈ యతివాదము రచన యొక్క ఒక ముఖ్య లక్షణమును వ్యక్తము చేయుచున్నది: రచన యనునది భాషాపరమైన ఆంతరంగిక జీవితము యొక్క ఆవిష్కరణము; బాలుని మూర్తిత్వము యొక్క ఒక సజీవాంగము. కనుక, బోధన యను బాహ్య సహాయముతో నంతగా నభివృద్ధి కవకాశము లేదు.

ఐతే, విద్యయంతయు నాధునికుల దృష్టిలో బాలుని యాత్మ వికాసమే. దానికి బోధన దోహద మిచ్చును. అట్లే రచనకూడ వారి యాత్మావిష్కరణమునకు తగిన సంస్కారముండిన, నది క్రమవికాసము చెందును. ఈ సంస్కార సహాయము బాలుర భావస్వాతంత్ర్యమును పరిమితము చేసినను, వారిని సోమరులనుచేసి భాషను, భావమునుకూడ అందించుచు రచనను సాగించినను, రచనయొక్క లక్ష్యమే నశించును.

ప్రణాళికలను, పరీక్షలను దృష్టియం దుంచుకొని సాగించు రచనలో పైన చూపిన లోపము చాల కనబడును. ఉపాధ్యాయుడంశమును నిర్ణయించి, దానికి కావలసిన క్లుప్త భావములను, ఉచితమైన శబ్దములను కూడ నిచ్చును. తాను పాఠములలో చదివిన సమాసములను, భావములను జీర్ణించుకొనకుండగనే బాలు డుపాధ్యాయు డిచ్చిన వానికి జేర్చును. అప్పుడు బాలుర రచనలో నాత్మీయతయే లేదు; తరగతిలోని బాలుర రచనలన్నియు నొకే యచ్చున తీసిన నిర్దుష్ట ప్రతిమలు. కాని, వానిలో జీవము, కళ మాత్రము లోపించి యుండును.

ఇట్టి రచనలో విశాల విద్యాదృష్టిలో నొక గొప్ప లోపమున్నది. బాలుర యాంత్రిక రచనలలో సాంప్రదాయిక మైన భావము, భాష ప్రదర్శితమై వాని యనుభూతికి స్థానము లేకుండ పోవును. క్రమముగ నుపాధ్యాయునకందు రచనకును, బాలుని యనుభూతికిని సంబంధమే లేకుండ పోవును. అందు వలన బాలుని నిజభావ ప్రపంచమును సంస్కరించు అవకాశమే యుపాధ్యాయునకు లేదు. అట్టి యథార్థ భావప్రపంచమునకు సహజమైన శబ్దరాశికూడ ప్రకటింపబడు నవకాశము లేనందున దానిని కూడ దిద్దుట పొసగదు. అప్పుడు మూరిత్వమునకు దర్పణము వంటిదగు సజీవశైలి వికసించుట కవశము లేదు. పరీక్షల కొరకై చేపట్టిన నిర్జీవ రచనను పాఠశాలకువదలి, తన యసంస్కృత భావసంపత్తితో బాలుడు బైటపడుచున్నాడు. పాఠశాలలో సాంప్రదాయిక రచన నుపాధ్యాయుని మెప్పునకు ప్రదర్శించినట్లే, జీవిత రంగములో సంఘామోదమును పొందిన సంప్రదాయిక ప్రవర్తనను బాహిరముగ బ్రదర్శించుచు, నాంతరంగిక జీవితములో బాలుడు తన యసంస్కృత భావానుగుణ్యమైన జీవితమును సాగించుకొనును. మాటలకు చేతలకున్ పోలిక లేని పెద్దమనుష్యులను నిత్యము చూచుచున్నాముకదా. దీని కంతకు రచన కారణమనుట యర్థములేని అతిశయోక్తియే; కాని, రచన కాత్మావిష్కరణమను విశాలార్థమును గ్రహించిన యెడల దానిలో కొంత సత్యమున్నదను పించును; పాఠశాల జీవిత

ములో అనుభవ ప్రమాణమైన యాచరణ నభ్యసించిన జీవిత ధర్మము సుగమమగుననిన నంగీకరించుట కభ్యంతరముండదు.

రచన యనునది విశిష్టమైన భాషాపాఠపు లాంఛనము మాత్రమే కాదు. అన్ని విషయములందును, ఆటపాటలందును కూడ సాగు భాషా కృషియంతయు నొకవిధముగ రచనయే. కనుక అందరుపాధ్యాయులును బాలుర క్రమబద్ధమైన, యనుభవ ప్రమాణముగల భాషణమునకు సహాయపడవలెను. ఇట్టి భాషణమే రచనకు పునాది.

ప్రాథమిక దశలో రచన యంతయు వాచికముగ సాగిన తరువాత, వ్రాతరూపమును పొందవలెను. మాధ్యమిక దశలోకూడ వాచిక కృషిపై నాధారపడియే రచన సాగును. పైదశలో బాలురు స్వీయచింతన కర్తృత సంపాదించినప్పుడు లిఖిత రచనను నియమించ వచ్చును. బాలుర జీవితముతో సంబంధపడిన యంశములు గ్రహించిన యెడల రచన చాల సులభమగును. సహజ సంభాషణలో వివిధ విషయముల గురించి మాటలు నేర్చినదాది పిల్లలెంత విపులముగ, వింత వింతగ మాట్లాడుదురో చూడుడు. అట్టి సహజ వాతావరణములో రచన యంతయు సాగిన అంశమొక సమస్యకాదు. అది లోపించిన పిల్లలు కలము కొరుకుటయే కాని, కండగల యూహాలను విప్పి వెలార్చలేరు. "కుక్కను గురించి 30 పంక్తుల వ్యాసము వ్రాయుము" అనుటకును, "నీ కుక్కతో నొక సెలవు నాడాడుకొనిన కథ చెప్పుము" అనుటకు నెంతో

భేదమున్నది. పెంపుడుకుక్క లేని బాలుడు కూడ కల్పనలో నాయానందము ననుభవించి, మనకు దానిని చవిచూపును. ఉల్లాస యుక్తమగు రచన కభ్యాసపడిన పిల్లలు వయస్సు, అనుభవము పెరిగిన కొద్ది, రచనయందలి మాధుర్యమును గ్రహింతురు; ఆత్మవిమర్శనము, జిజ్ఞాస యబ్బును. సంగీతము చిత్రకళవలె క్రమముగా రచనకూడ ఆనంద దాయకమైన కళయగును. అప్పుడు ప్రపంచ ప్రఖ్యాతినిపొందు రచయితలు కాకున్నను, పఠనయోగ్యములు, ప్రేమప్రధానములు ఐన లేఖలను విద్యావంతు లందరు వ్రాయగలిగి యుందురు.

ఇక రచన దిద్దుబాటు. ఇది భావసంబంధము, భాషా సంబంధముకూడ. వీనిలోసహజముగ భావమే ప్రధానమైనది. దానిలో క్రమత, బలము, విశ్వాసము, ఔచిత్యము, ఔన్న త్యము మొదలగు లక్షణములు ముఖ్యమైనవి. ఇందలి లోప ములను సవరించుటలో పిల్లలు నిరుత్సాహ పడరాదు. భాషా లోపములు చాలవరకు బాలు రశ్రద్ధ వలన చేయుదురు. అట్టి వాని నుపాధ్యాయుడు సవరించకుండ సూచించి మాత్రమూర కుండవలెను. ఈరహస్య మెరుగని యుపాధ్యాయు లనవసర ముగ శ్రమపడి ప్రతి యక్షరము దిద్దుదురు. వేగముగ తన పని సాగుటకు, బాలుడు తన లోపములను శ్రద్ధగ పరిశీలించు నట్లు చేయుటకు, ఉపాధ్యాయుడు కొన్ని చిహ్నముల నుప యోగింప వలెను. వానిని తరగతికి సంవత్సరారంభముననే చూపి, వాని వినియోగములోని సౌలభ్యమును తెలుపవలెను,

బాలు రొకసారి చేసినతప్పులు పునః చేయకుండ చూడ వలెను.

## —॰ పరిశీలనాంశములు. ॰—

(1) "బాలుని సర్వభాషాకృషి ఫలితముగ లభించు భావ పుష్టి, భాషా సరళతయొక్క సమ్మిళిత సామర్థ్యమే రచన," అను నిర్వచన మెంతవరకు తృప్తికరమైనది?

(2) సామాన్యముగ పాఠశాలలో సాగు రచనలోని లోప ములెట్టివి? వానిని సవరించు టెట్లు?

(3) 'మూర్తిత్వమునకు దర్పణమువంటి శైలి'ని రచనలో నెంతవరకు నేర్పనగును?

(4) "పాఠశాల జీవితములో ననుభవ ప్రమాణమైన యాచరణ నభ్యసించిన, జీవిత ధర్మము సుగమ మగును" అనుదానిని రచనదృష్టితో పరిశీలించునది.

(5) రచనలో సంశాభావము యొక్క సమస్యను పరిష్క రించు టెట్లు?

(6) రచన దిద్దుబాటును మీరెట్లు సాగించుచున్నారు? ఇచ్చటి సూచనలు మీకెంతవర కంగీకారములు?

# 14. వ్యాకరణ బోధనము

సహజ వికాసమున్న భాషలన్నిటిలోను దీర్ఘ కాలము భాషా వ్యవహారము సాగిన తరువాతనే వ్యాకరణము లేర్పడినవి. విద్యావిహీనుల దుష్టవ్యవహారము, భాషయందు రూఢమైన శిష్ట వ్యవహారమును భ్రంశము చేయకుండ నిలుపుట వ్యాకరణము యొక్క ముఖ్య ధర్మము.

వ్యాకరణమేర్పడిన విధమును, దాని ధర్మమును పరిశీలించిన యెడల పాఠశాలలో వ్యాకరణము యొక్క స్థానము అచట వ్యాకరణమును బోధించు విధానము కూడ స్పష్టపడును.

పాఠశాలకు వచ్చుసరికే బాలురలో కొంత భాషా వ్యవహారము రూఢమైయుండును. క్రమముగా వారి భాషా వృత్తము పెరుగుచుండును. అప్పుడు భాషాసంబంధమైన సందేహములు తగులుట సహజము. అట్టివానిని తొలగించు ధర్మము వ్యాకరణము చేయవలెను. బాలుర యక్కరనుబట్టి క్రమముగా బోధింపబడు వ్యాకరణమును నైమిత్తిక వ్యాకరణమనవచ్చును.

ఆచరణలో నిప్పటికిని నైమిత్తికదృష్టి యేర్పడలేదు. వ్యాకరణశాస్త్రమునంతను ఏక కేంద్రపద్ధతిని ప్రాథమికదశ నుండి, విద్యాపూర్తి యగువరకు బోధింప ప్రయత్నించుచున్నాము. దీనివలన విద్యార్థిసామాన్యమునకు వ్యాకరణ వాసనయే లేదు. శ్రద్ధావంతులు పరీక్షలందలి వ్యాకరణ ప్రశ్న

లకు తృప్తికరముగ సూత్రములుచెప్పి యుదాహరణ లిత్తు కాని, ఆచరణలో ఆ సూత్రములనే పాటింపలేరు.

దీనినిబట్టి భాషాభ్యాసనములోని కొన్ని ముఖ్యలక్షణములు వ్యక్తమగుచున్నవి: భాషావ్యవహారముతో సమ్మిశ్రితమైన వ్యాకరణాంశములు, అనుకరణ సూచనల ప్రభావముచే నేర్చిననే పిల్లలకు లాభించునుగాని, సూత్రములను కంఠస్థము చేయుట లాభకారికాదు.

పాఠశాలకు వచ్చుసరికే పిల్లలు మాతృభాషలో వ్యాకరణజ్ఞానము లేకుండ, వివిధ వ్యాకరణాంశముల నప్రయత్నముగ వ్యవహరింతురు. వాక్యప్రణాళికలు, లింగవచన విభక్తులు, కాలములు మొదలగువాని ప్రయోగములను ధారాళముగ సాగింతురు. పాఠశాలలోని తొలిదశలో, అనగా ప్రాథమికదశలో, నీ పద్ధతినే వ్యాకరణబోధన సాగవలెను: వచన పాఠములలోను, రచనలోను వాంఛనీయమైన వ్యాకరణాంశములను వ్యవహారమునందు పొందుపరచినయెడల బాలురు వాని ప్రయోగమును గ్రహింతురు.

వచనపాఠములందలి వ్యాకరణ బోధనానుకూలమైన సామగ్రిని గ్రహించి, అందలి సామ్యములను, వైరుధ్యములను గ్రహింపజేసి, బాలురచే సూత్రములను రాబట్టవలెను. దీనిని ప్రతిష్ఠాపనపద్ధతి యందుము. ఇట్లొకమారు స్వప్రయత్నము చేత సాధించిన సూత్రములను జ్ఞాపకముంచుకొనుటలో బాలురకు వ్యవహార సౌలభ్యము తెలియును. క్రింది తరగతులలో ప్రతిష్ఠాపనపద్ధతిని నేర్చిన సూత్రములను పై తరగతిలో

పునరావృత్తిప్రాయముగ ప్రయోగపద్ధతిని బోధింపవలెను. దీనివలన, పిల్లల యశ్రద్ధవలన ప్రమాదములేకుండ చేయవచ్చును. ప్రయోగపద్ధతిని బోధన వేగముగ సాగును. రచనయందును, వాచికకృషియందును, పిల్లలు వచనపాఠముల సహాయమున నేర్చిన వ్యాకరణాంశములకు వలయునంత అభ్యాసమీయవలెను. అప్పుడు వారి వ్యాకరణజ్ఞానము గాఢమగును.

ఈనాటికిని మన పాఠశాలలలో తెనుగు వ్యాకరణబోధన "అక్షరప్రకరణము" తోనే మొదలగుచున్నది. ఇట్టి బోధనలో వ్యాకరణశాస్త్రమును సమగ్రముగ బోధింపవలెనను లక్ష్యమేకాని, బాలుర వ్యవహారముతో నంతగపనిలేదు. ఇట్టిదానిని ప్రయోగవ్యాకరణ మనవచ్చును.

నైమిత్తికదృష్టితో మన భాషావ్యాకరణమును పరిశీలించినయెడల లింగవచన విభక్తులు, ద్రుతము, యడాగము, సంధి మొదలగునంశములు మునుముందుగ బోధింపవలసినవని తెలియును. ప్రాథమికదశలో వచనపాఠములు విసంధిగనే ఉండునని చూచితిమి. అందువలన మాధ్యమికదశ, అనగా సంధిని పాటించి వచనపాఠములు వచ్చుదశ, వరకు సంధిబోధనను మొదలుపెట్ట వీలులేదు.

నైమిత్తిక వ్యాకరణమునుకూడ ప్రాథమికదశలో బోధించుట మంచిదికాదు. కాని, మన దేశములో చాలమంది ప్రాథమిక దశతోనే విద్యను చాలించుకొను పరిస్థితులలో నీ యాదర్శము పెట్టుకొనిన వారి కెన్నటికిని వ్యాకరణ వాస

# 15. గ్రాంథిక వ్యావహారికములు

ప్రతిభాషయందును బహుకాలము భాషావ్యవహారము సాగినపిమ్మటనే గ్రంథములు, వ్యాకరణములు ఏర్పడినవి. అప్పటివరకు ద్రవరూపములోనుండిన భాషలకు, గ్రంథవ్యాకరణముల ప్రభావమున, స్థిరరూపమేర్పడినది. ఐతే వ్యవహారముమాత్రము నదీప్రవాహమువలె సాగుచునేయుండును. కాని, గ్రంథవ్యాకరణములు వ్యవహారమునకు కట్టలవలె పనిచేయుటవలన, దాని పరిణామమును కొంతవరకు అరికట్టును. అట్లైనను, దీర్ఘకాలముమీద రూఢమైన శిష్టవ్యవహారము ప్రామాణికమై గ్రంథవ్యాకరణములలో స్థానముపొందును. ఈ విధముగా వ్యవహార వ్యాకరణము లన్యోన్యాశ్రయములై పెంపొందుట నాగరక భాషలయొక్క జీవధర్మము.

అనేక రాజకీయ సాంఘిక కారణములవలన మన భాషలోమాత్రమీ సహజవికాసము లోపించి, గ్రాంథిక వ్యావహారికములమధ్య పెద్ద యంతరమేర్పడినది. 11, 12, 13 శతాబ్దములనాటి కవిత్రయమువారు గ్రంథస్థముచేసిన తెనుగీనాటికిని ప్రామాణికమైనది. దానినే పట్టుకొని ప్రాకులాడువారు తామే ఉపన్యాసాది సందర్భములలో నుపయోగించు శిష్ట వ్యవహారముకూడ గ్రంథయోగ్యము కాదందురు. ఆంగ్ల సంపర్కమున నాధునికదృక్పథ మలవడిన ప్రజాహితులా భాషను కృతకభాషగా త్రోసిపుచ్చి, ఈనాటి వ్యవహారము నన్నియుపయోగములకు దింపిరి. ఆంగ్లమున భాసర్ కు

షేక్స్పియర్ కు; షేక్స్పియర్ కు జెనిసన్ కు గల సహజ భాషాభేదము లన్ని భాషలందును సహజమేయని వారు తెలిసి కొనిరి.

ఐతే బహుకారణములవలన సహజవికాసము స్తంభించి పోగా, తెనుగునాట వివిధప్రాంతములందలి భాషా వేణి పాయలుపాయలై పరువులిడుచున్నది. ఒక ప్రాంతములో వాడు భాష మరొకప్రాంతమున నర్థమేకాదు; కొన్ని శబ్దము లసభ్యములనిపించును. అందువలన వ్యావహారికవాదుల సిద్ధాంతము సరియైనదైనను ఆచరణ కష్టమగుచున్నది. ఈ యిరు వాదముల బలాబలముల నిట్లు క్రోడీకరింపవచ్చును.

## వాడుక భాష

(1) ఈనాడు పత్రికలు, ఉపన్యాసములు, తరగతి బోధన, సుప్రసిద్ధకవుల రచనలు వాడుకభాషలోనే సాగుచున్నవి; అది జనసామాన్యమునకు విజ్ఞానదాయక మగుచున్నది.

(2) పైనచూపిన సందర్భములలో గ్రాంథికభాష కృతకముగ నుండును.

(3) వ్యవహారము కాలపరిభావమున మారునని శాస్త్రజ్ఞులే యంగీకరింతురు. మరి, బాహ్యకారణములవలన తాత్కాలిక స్తంభన యేర్పడినను, మనభాషలో నీనాడేర్పడిన సహజవికాసమును వారే యంగీకరింపకుండుట శోచనీయము.

## గ్రాంథిక భాష

(1) స్థిరరూపమును వదలి, బహుముఖములనున్న వ్యవహారము నంగీకరించినభాష ఛిన్నాభిన్నమగును.

(2) తెనుగువారందరు నొక్కమ్మడిగ వ్యవహారమును సాగించుయోగ్యత దిగజారును.

(3) మనభాషలోనిదే యైనను, ప్రాచీనవిజ్ఞానముతో సంబంధము తెగిపోవును.

ప్రజాదృష్టిలో వ్యవహారసౌలభ్యము, ప్రామాణికత కూడ వాంఛనీయములే. ఈ రెండుశుభలక్షణములను జీర్ణించుకొనిన ఒకసరళప్రామాణికభాషను పరిణతినందించుకొనవలసిన యగత్యము మనభాష కెంతేనికలదు. ముఖ్యముగ తరగతిబోధనయు, గ్రంథములునేకముఖమున సాగనందున తెనుగుపిల్లల కనవసరమైన కష్టమేర్పడుచున్నది. భాష చాల వరకనుకరణ సాధ్యమైనది. ఉపాధ్యాయుడు పలుకినట్లే వ్రాసిన బాలునకు భాషానిర్దుష్టత యబ్బుట సులభము. ఈదృష్టితో భాషావ్యవహార సందర్భమున నుపాధ్యాయునకొక ప్రత్యేకబాధ్యత యున్నది. ఉపాధ్యాయులొక యొక్కుమ్మడిగ ఈ యుద్యమమునకు నడుముకట్టి, పండితాంగీకారముతో ప్రకృతశిష్టవ్యవహారమును వ్యాకరణయోగ్యము చేసినచో మనభాషకు యుగప్రాముఖ్యముగల సంస్కారసేవ చేసినవారగుదురు. ఈనాటి బహుసంఖ్యాకులైన నిరక్షరాస్యులు క్రమముగా విద్యాలాభమును పొంది, అట్టి ప్రామాణికభాషను స్వీకరింతురు.

## — పరిశీలనాంశములు —

(1) మనభాషలో గ్రాంథికవ్యావహారికముల మధ్యగల అంతరమునకు కారణములను పరిశీలించి, భాషపై దానిప్రభావమును వివరింపుడు.

(2) ఈ యంతరమువలన విద్యార్థికేర్పడిన కష్టమెట్టిది ?

(3) ప్రామాణికభాషయనగా నేమి ? దాని నిర్మాణమున నుపాధ్యాయు డెట్టిబాధ్యత వహింపగలడు ?

(4) ప్రామాణిక భాషదృష్టిలో గ్రాంథికభాషనుండి విసర్జింపవలసినవి, వ్యావహారికమునుండి గ్రహింపదగినవి కొన్ని వాక్యప్రణాళికలు, శబ్దములు ఉదహరింపుడు.

(5) ప్రామాణికభాష యేర్పడినయెడల వాచకములందును, వాచికకృషియందు రాదగుమార్పులను కొన్నిటిని సూచింపుడు.

---

# 16. బాలుర శబ్దరాశి

ప్రాచీనపద్ధతిలో బాలుర శబ్దరాశిని వృద్ధిచేయుటకై ప్రత్యేకప్రయత్న మండెడిది కాదు. పాఠశాలయందును, బాహ్యజీవితమునందును సాగు భాషావ్యవహార ప్రభావమున సహజముగ బాలురకు కొన్ని శబ్దములు స్వాధీనమగును, కాని, వీనిలో నొక ప్రామాణికతలేదు. బాలుని విద్యాభ్యాసంగ మునకును, సాంఘికజీవితమునకును, అతడు గ్రహించు శబ్ద రాశి చాలునాయను నంశమును నిర్ణయించు అవకాశము లేదు.

ఆధునికు లీ పరిస్థితిని చాలగా సంస్కరించిరి. భాషా బోధనలో భాషకు, సాహిత్యమునకు విభేదమును పాటించు టతో నీ సంస్కారము ప్రారంభమైనది. భాషలో వాక్య ప్రణా ళిక, వ్యాకరణాంశములు, శబ్దరాశి ముఖ్యముగ గ్రహింప బడినవి.

ప్రతిభాషయందును శబ్దరాశి యనంతముకదా. వీనిలో నెన్ని శబ్దముల నేతరగతిలో నెట్లు బోధింపవలెననునది యుపా ధ్యాయుని ప్రశ్న. ఈ ప్రశ్నకు శబ్దరాశిలో ప్రయోగ క్రమ సూత్రము సమాధానమిచ్చినది.

బాలుని సంగ్రహణశక్తి, అభ్యసనకాలముకూడ పరి మితములే. ఈరెండు పరిమితులను గమనించి, అతని కెక్కువ వినియోగించు మాటలను కాఠిన్యక్రమములో బోధించవలెను. ఆంగ్లమువంటి భాషలలో ననేకమంది పరిశోధకులు బాలుర భాషావ్యవహారమును, ఆవశ్యకతను బాగుగా పరిశీలించి శబ్ద

సంగ్రహములను సిద్ధముచేసిరి. వీనిలో ఎక్కువ ప్రయోగ ములోనున్న మాటలు ముందు, తక్కువప్రయోగములో నున్న మాటలు క్రమముగా పిమ్మట వచ్చును. ప్రతిశబ్దమునకు సంఖ్యలతో స్థాననిర్ణయమగును. వివిధపరిశోధకులు సిద్ధముచేసిన సంగ్రహములలో భేదములుండుట సహజము. కాని, ఒక మూలసూత్రముచే బంధింపబడుటచే విశేషభేదముల కవకాశము కూడ లేదు.

వాచకములు నిర్మించుటకై ఈ శబ్దసంగ్రహముల నుండియే శబ్దములు గ్రహింపబడవలెను. ఇట్టిశబ్దములను బాలురదృష్టిలో స్వాధీనములు (అర్థప్రయోగము తెలిసినవి), పరిచితములు (అర్థముమాత్ర మెరిగినవి), ఊహ్యములు (అర్థముమాత్ర మూహింప నవకాశముగలవి), నూతనములు, అని నాలుగుశాఖలుగా భావింపనగును. వీనిలో మొదటి మూడింటివృత్తములు వికసింపజేయుటయే యుపాధ్యాయుని లక్ష్యము.

ఇక నేతరగతిలో నెన్ని శబ్దములను బోధింపవలెను అను ప్రశ్నకలదు. బాలశిక్షలో నొక్కటియు నూతనశబ్ద ముండ కూడదని సిద్ధాంతము. ప్రాథమికదశలోని ఐదుతరగతులందు క్రమముగా 300—400—500—700—800 శబ్దములను బోధింపవలెనను సూచనకలదు. క్రిందితరగతులలోని నూతన శబ్దము లభ్యాసమునకై పై తరగతులలో పరిచితశబ్దరాశిగా ప్రవేశపెట్టబడును.

ఐతే మనభాషలో శబ్దములలో ప్రయోగక్రమము కాని, ఆయాతరగతులందు బోధింపదగిన శబ్దసంఖ్యగాని నిర్ణయింపగల ప్రయోగములేవియు జరగలేదు.

వచనపాఠములో నేర్చిన శబ్దములు రచన, వాచిక కృషులలో రూఢముచేయబడును. వచనపాఠములోని పునర్విమర్శనములో వచ్చు ప్రయోగవాక్యములను బాలురు వ్రాసుకొని కంఠస్థము చేయునట్లు నియోగించుట ఒక ఆచరణ యోగ్యమైన విధానము.

## పరిశీలనాంశములు.

(1) శబ్దరాశి ప్రవేశవిధానములో ప్రాచీనులకును, ఆధునికులకును గల భేదములేవి?

(2) శబ్దప్రయోగసూత్రమును వివరించి, బాలురకదెట్లుపకరించుచున్నదో తెలుపుడు.

(3) ప్రయోగక్రమము, బోధనీయశబ్దసంఖ్య అను సంశములనుగురించి తెనుగులోని కొరతలెట్టివి? వానిని తీర్చుటెట్లు?

(4) బాలురు నూతనముగ నేర్చు శబ్దపరిజ్ఞానమును రూఢము చేయుటెట్లు?

# 17. వాచకములు

ప్రణాళికపరిమితుల నిర్ణయమునకు, విషయస్పష్టతకు, పరీక్షపర్యవేక్షణల సౌలభ్యమునకు, బాలుర పునశ్చరణ సౌకర్యమునకు ప్రతివిషయమునందును పాఠ్యగ్రంథము లగత్యము. వివిధశాస్త్రములలో సమర్థులైన యుపాధ్యాయులున్నప్పుడు పాఠ్యగ్రంథముల ప్రాముఖ్యము చాలతక్కువ. కాని, భాషలో నివి అత్యావశ్యకములు. గణితము, విజ్ఞానశాస్త్రము, భూగోళశాస్త్రము మొదలగు శాస్త్రములలో నేపుస్తకము లేకుండగనే ఉపాధ్యాయుడు బోధన సాగింపవచ్చును. కాని, భాషలో నది దీర్ఘకాలముసాగదు. భాషయందు ప్రత్యేకాంశమేదియు లేదు; ఏదోయొకయంశము నాధారముగ జేసికొని "భాషాసాహిత్యముల"ను ప్రదర్శించుటయే భాషయందలి పాఠ్యగ్రంథముల ధర్మము.

ప్రణాళిక, పఠనము, గద్యపద్యములు, రచన, శబ్దరాశి మొదలగు అధ్యాయములలో పరోక్షముగ వాచకముల లక్షణములు సూచింపబడినవి. వివిధదశలందలి బాలుర యర్థాతాభిరుచులు, వారిభాషావ్యవహారపు టవసరములు వాచకనిర్మాణమును శాసించు ముఖ్యసూత్రములు.

వచనపాఠములు భాషను, పద్యపాఠములు సాహిత్యమును, బోధించుటకు ముఖ్యసాధనములని చూచితిమి. ఈ రెండింటియందును భాష పునాదివంటిదగుటవలన దీని బోధన నిర్లోపముగ సాగుటకు ప్రాథమికదశలోని వాచకము

లేక రచయితయే నిర్మింపవలెనని చూచితిమి. వచనపాఠముల సంకర్భములో నిది చాలముఖ్యము.

బాలుర యభిరుచులు, అభిజ్ఞత, విషయమునందును, సాహితీశాఖలందును సాధ్యమగునంత వైవిధ్యమును పొందునట్లు వాచకములందు గ్రహింపబడు అంశములు వివిధశాఖలకు చెందియుండవలెను. వానియభ్యసనము బాలుర విస్తారపఠనమునకు దోహదముకావలెను.

మన దేశములో పాఠశాల దశయందు, ప్రాథమిక మాధ్యమిక దశలలో నొకేయొక వాచకము నిర్ణయింపబడుట చూచుచున్నాము. కాని, అమెరికావంటి దేశములలో నసంఖ్యాకములైన వాచకములను ప్రతితరగతిపిల్లలు నభ్యసింతురు. దానివలన వారికుత్సాహము, అభిరుచి, ఆత్మవిశ్వాసము, విస్తృతపఠనేచ్ఛ పెంపొందును. జీవితానుభవమునందువలెనే భాషానుభవమునందు కూడ వైపుల్యము సామర్థ్యమును సాధించును.

మనపాఠశాలలో ప్రాథమికదశయందే వివిధ తరగతులకు వివిధరచయితల వాచకములను నిర్ణయించుట చూచుచున్నాము. ఇది వాంఛనీయముకాదు. శబ్దరాశి మొదలగు భాషాంశము లొకదశయందలి తరగతులన్నిటిని దృష్టియందుంచుకొని, బాలశిక్షమొదలు నాల్గవతరగతివరకు గల వాచకములలో బోధింపబడును. కనుక పిల్లలకీవాచకములను నిర్ణయించుటలో పరంపరసూత్రము పాటించుట చాల అవస

# 18. మౌనపఠనము

తీరిక కాలములో విద్యావంతుల యిండ్లలో చూడుడు. అందరును ఏదో యొకటి చదువుకొను చుందురు. మిక్కిలి చిన్న పిల్లలు కొంతవరకు బాహ్యాపఠనము చేసిన చేయుదురు కాని, పెద్దలందరును మౌనపఠనమే సాగింతురు. ఆధునిక పౌరునకిట్టి పఠన మావశ్యకమైనది. వృత్తికి, విజ్ఞానమునకు, వ్యాపకమునకు, తీరిక కాలములో నపారమైన పఠనము తప్పని సరి. అందువలన విద్యార్థులలో మౌనపఠనాభ్యాసమును స్థాపించుట ఒక ముఖ్య ధ్యేయమైనది.

పఠనబోధన సందర్భమున పఠనముయొక్క యాంత్రిక సౌలభ్యమును గురించి వివరించితిమి. గద్యపద్యముల బోధన సందర్భమున భావస్ఫోరకముగ చదువుటను గురించి చూచితిమి. ఇదంతయు ప్రకట పఠనము. నిరక్షరాస్యత ప్రబలియున్న మన దేశములో శ్రోతల పరమైన ప్రకట పఠనమునకు చాల ప్రాముఖ్య మున్నది. జానపద జీవితములో పురాణ శ్రవణ మొక ప్రత్యేక సంస్థయే. ఈనాడు వార్తా పత్రికల పఠనము కొంతవరకు పురాణ కాలక్షేపపు స్థానమాక్రమించినది. ఇట్లు పండిత పామర జనరంజకముగా చదువుట ఒక విశిష్టమైన కళయే.

ఐతే ప్రకట పఠనము శ్రమకరమైనది; వాగింద్రియము తొందరగ నలసటచెందును. వేగముకూడ తక్కువ; వాగింద్రియావయవముల చలనముచే పఠనవేగము పరిమితమగును,

పాఠకుని యవధాన మొకవంక పఠితాంశము మీదను, మరొక వంక తన గొంతు ధ్వనిమీదను పడి, భావసంగ్రహణ శక్తి కొంత తగ్గును.

మౌనపఠనములో వాగింద్రియమునకు శ్రమ లేదు. దీర్ఘ కాలము పఠన సాగించుకొన వచ్చును. అదికూడ నయన వేగముతో సాగును. దీని ఫల మపారము. బహుకార్య నిమగ్నులైన యాధునికులకిది యెంతయో వినియోగకారి. మౌన పఠనములో క్లిష్ట గంభీర భావములను కూడ ప్రశాంతముగ గ్రహింపనగును. ప్రక్కవారికి శ్రమ లేదు.

క్షుణ్ణపఠనమునకు, విస్తృత పఠనమునకు కూడ అనుబంధముగ మౌనపఠనము సాగింతుము. మొదటి దాని లక్ష్యము శబ్దభావములకు రెండింటికి సంబంధించిన వివరము లన్నియు కూడ సమగ్రముగ గ్రహించుట. వచనపాఠ సందర్భమున వివరించిన మౌనపఠన మిట్టిది. ఇది కొంచెమించుమించు ప్రకట పఠనము వలెనే నెమ్మదిగ సాగును. అర్థకాఠిన్యమున్న చోట వేగమింకను తగ్గుట సహజము. డాల్టన్ పద్ధతిని బోధన సాగునపుడు వివిధ విషయముల యభ్యసన మిట్టి మౌనపఠన సహాయముననే సాగును.

ఇక విస్తృత పఠనానుబంధమైన మౌనపఠనములో వేగము ముఖ్యము. ఇట్టిపఠనము సాధారణముగ నానందము నకో, సులభాంశసంగ్రహణమునకో సాగును. అట్టి సమయము లందంశమును స్థూలముగ గ్రహించుచు పోయిన చాలును,

పాఠకుని ప్రతిభాభ్యాసములను బట్టి విస్తృత మౌనపఠన వేగ మపారముగ సాగును.

ఇట్టి మౌనపఠనము బోధన సాధ్యము కాదనియు, తూష్ణీ పఠన కానుషంగికముగ వికసించుననియు నొక మతము కలదు. కాని, ఆచరణలో నన్ని యభ్యాసములవలెనే నిదియు పిల్లలకు ప్రయత్న పూర్వకముగ నేర్పుట వాంఛనీయము. దీనిని నేర్పుటకే యుపవాచకములు తోడ్పడును. కనుకనే యుపవాచకములలో శబ్దకాఠిన్యము కూడదనియు, అంశమమిత ముగ నానంద దాయకముగ నుండవలెననియు సిద్ధాంతము. అట్టి గ్రంథముల నాతృతతో చదువుచు బాలు రప్రయత్న ముగ ప్రకటపఠనమునుండి మౌనపఠనమునకు దిగుట సామా న్యముగ చూడనగును.

సుశిక్షితము కాని మౌనపఠనములో శబ్దధ్వని లేకుండ గనే వాగింద్రియ వ్యాపారమంతయు సాగుచుండ వచ్చును. అప్పుడు వేగమంతగ నుండదు. ఈలోప మేర్పడకుండ చూచుటయే మౌనపఠన బోధనలోని ముఖ్యలక్ష్యము.

పఠించునప్పుడు మనదృష్టిసాగుట సినిమా చిత్రములను పోలియుండును. వివిధ చిత్రముల పరంపర సజీవ చైతన్య భ్రాంతిని కలిగించునట్లే యాంత్రికముగ కదలు దృశ్యాతము ప్రవాహమువలె కనబడును. భావస్ఫురణమెంత వేగముగ సాగిన దృక్ప్రసారమంత వేగముగ సాగును. విషయ సౌల భ్యము, ఆనందము, పాఠకుని సంస్కార సంకల్పములు అట్టి వేగమునకు దోహదమగును.

మెరపుటట్టులు. గ్రంథాలయము మొదలగు స్థలములందలి లిఖిత నియమములు మౌనపఠనమునకు చక్కని పరివేశము, ధారాళమైన ప్రకటపఠన మబ్బుసరికి తొలి ప్రాథమికదశ దాటును. కనుక ఏ మూడవతరగతిలోనో మౌనపఠన మారంభింపనగును. సులభము, ఆనందదాయకము అగు నుపవాచకములు మౌనపఠన బోధనకెంతయు ననుకూలమైన సామగ్రి.

ఉపాధ్యాయుడు ముందుగ ప్రకట పఠనవేగమును గమనించియుండును. మౌనపఠనమునకు నియమించిన పాఠభాగములకు ప్రకటపఠనమున చదువుటకు చాలనంత తక్కువ కాలమీయవలెను. అప్పుడు సహజముగ బాలురు ముఖ్యాంశములను గ్రహించుచు, వేగముగ మౌనపఠనము సాగించుటకు సంకల్పింతురు.

పఠితాంశమునందు ముఖ్యాముఖ్యముల నిర్ణయము బాలురకు సులభముకాదు. దానికి సహాకరించుటకై మౌనపఠనము మొదలుపెట్టుటకుముందు కొన్ని ప్రశ్నలనిచ్చి పఠనములో వానికుత్తరములను గ్రహించునట్లు సూచింపవలెను. మౌనపఠనము చక్కగ నబ్బుటకు విపులపఠనముకన్న వేరు మార్గములేదు. ప్రాథమికదశతో విద్య చాలించుకొనువారిలో మౌనపఠనాభ్యాసము స్థిరపడకుండిన, బడివదలిన నాలుగైదేండ్లలో వారు నిరక్షరాస్యతకు దిగజారుట తథ్యము.

## పరిశీలనాంశములు

(1) విద్యార్థి దశయందును, జీవితమునందును ప్రకట మౌనపఠనముల స్థానము వివరించునది.

(2) బాలురలో మౌనపఠనాభ్యాసమును స్థాపించుమార్గమును విశదీకరింపుడు.

(3) మౌనపఠనబోధన కనుకూలమైన సామగ్రిని వివరింపుడు.

(4) మౌనపఠనము దిమిడియున్న వివిధాంశములను వివరింపుడు.

(5) సుశిక్షితముకాని మౌనపఠనములోని సామాన్యలోపమెట్టిది? దానిని తొలగించుట యెట్లు?

---

# 19. గ్రంథాలయకృషి

మౌనపఠన సందర్భములో బాలుర విపుల వాఙ్మయసేవయొక్క అక్కరను చూచితిమి. అట్టి విస్తారపఠన సాధనము గ్రంథాలయము. తరగతులందలి వివిధవిషయముల బోధన కనుబంధముగను, బాలుర యానందముకొరకు, వారి విడుపుకాలము సద్వినియోగమగుటకు గ్రంథాలయకృషి యుపకరించును.

ఐతే కొన్ని నిర్వహణ లోపములవలన పాఠశాల గ్రంథాలయములు విద్యార్థులకంతగా నుపయుక్తముగ లేకపోవుట అనుభవసిద్ధమే. ప్రతిభావంతులు, శ్రద్ధాళువులు ఐన ఏ కొద్దిమంది పిల్లలోతప్ప ఇతరులు పాఠ్యగ్రంథములకు మించిన గ్రంథపరిచయ మెరుగనే యెరుగరు. జెంకిన్సన్ అను

నాయన పరిశోధనల ఫలితముగా 10–15 సం॥ల వయస్సుగల అమెరికన్ పిల్లలు సంవత్సరమునకు 30 లక్షల మాటలను చదువుదురని తేలినది.

పఠనాభ్యాస మేర్పడని పసివారిని తమంతట తాము చదువ వదలిన నెక్కువ లాభములేదు. తరగతిలోను, ఆటపాటలలోను, ఉపాధ్యాయులు వారి యభిరుచులను పరిశీలించి, వాని కనుగుణ్యమైన గ్రంథములనిచ్చి, క్రమముగా పఠనమున కాకర్షింపవలెను. ఈ విధానము జయప్రదమగుటకు ప్రతి యుపాధ్యాయుడును తన విషయమునకు సంబంధించిన బాల వాఙ్మయమును తానే పిల్లలకిచ్చు ఏర్పాట్లు చేసికొనవలెను.

ఈ పద్ధతిని పాఠశాలకంతకు నొకే గ్రంథాలయ ముండుట, అందు పుస్తకమున కొకటిరెండుప్రతులే యుండుట సమంజసముకాదు. తరగతి పిల్లలకందరికి సరిపడినప్రతులు ప్రతి పుస్తకమునకు నుండవలెను. తరగతియంతకు నొకేప్రతి నిచ్చి, నిర్ణీతకాలముతరువాత తరగతిలో నా గ్రంథమందలి ముఖ్యాంశముల నుపాధ్యాయుడు ముచ్చటించవలెను. ఇట్లు చేయుటవలన తీసుకొనిన పుస్తకములను చదువని సోమరులు హెచ్చరింపబడుదురు. పఠితవిషయము చక్కగ సమీక్షింప బడి బాలురకు విమర్శనశక్తి యలవడును.

ఈ విధానములో పిల్లల వ్యక్తిగతాభిరుచులకు స్థానము లేదను నాక్షేపణమొకటి తోచును. అట్టి యభిరుచులకు భంగములేకుండ, తరగతి కృషికిమించి బాలురకు పఠనమున స్వేచ్ఛనీయవచ్చును. ఎట్టిపఠనమును చేయని సామాన్య

...లురను వరుసముగ నాకర్షించుటకే యీ పద్ధతి సూచింప
...సినది. తరగతిలోని బాలురను గణములుగా విభజించి,
...ొక్కగణమున కొక్కొక్క పుస్తకమిచ్చుటకూడ ఆచర
...యమైన పద్ధతియే.

## — పరిశీలనాంశములు —

(1) బాలురకు గ్రంథాలయ కృషివలని లాభములేవి ?
(2) మీ పాఠశాలలోని గ్రంథాలయ నిర్వహణవిధాన మెట్టిది ? దానిలో నెట్టిమార్పులు కావించిన పిల్లల కుపకరించును ?
(3) వివిధపాఠశాల దశలందలి పిల్లలు ఆయా తరగతులలో సంవత్సరమున కెన్ని పేజీలు చదువుట సంభవము ?

---

# 20. పరీక్షలు

అన్ని విద్యావిధానములందును నిర్ణీతకాలము విద్య సాగినపిమ్మట విద్యార్థులనుపరీక్షించి వారి యర్హతలను నిర్ణయించుట యవసరమే. కాని, ఈనాటిపరీక్షల విధానములో ను త్తీర్ణులైనవారు జీవితపరీక్షలో నెగ్గలేకుండుట, ఉత్తీర్ణులు కాని వారు త్తీర్ణులైనవారికన్న జీవితము నెక్కువ జయప్రదముగ నిర్వహించుకొనుట, మనపరీక్ష విధానమునకు, విద్యావిధానమునకు కూడ గొప్పకళంకమును తెచ్చిపెట్టినవి.

—• పరిశీలనాంశములు •—

(1) ఈనాటి పరీక్ష విధానములోని లోపములేవి? భాషా పరీక్షలలో వీనినెట్లు తొలగింప వలెను?
(2) ఉత్తమ పరీక్ష విధానములో బోధకుని స్థానమెట్టిది?
(3) మీ పాఠశాలయందుజరుగు పరీక్షలలో వాచికపరీక్ష కెంత స్థానమున్నది?
(4) ఆచరణతో భాషాపరీక్షలను సమన్వయించుటకు సహాయకరమగు సూచనలను చేయుడు.

---

# 21. (అ) కిండర్ గార్టెన్ పద్ధతి

"మా పిల్లవాడాటపాటలే కాని చదువుసంధ్య లెరుగడ"ని విచారించు వారి నెందరినో చూతుము. ఆటపాటలకు చదువుసంధ్యలకు సహజ వైరుధ్యమని వారినమ్మకము. మానసికశాస్త్రమీనమ్మక మసత్యమని చాటుచున్నది; పైగా ఆట విద్యకొక విశిష్ట సాధనమని సిద్ధాంతము.

శిశువుయొక్క జాగ్రదావస్థ అంతయు క్రీడయందే మునిగి యుండును. శిశు స్వభావములో క్రీడకొక ముఖ్యస్థానమున్నది. దీని నణచుట యసాధ్యము, అవాంఛనీయముకూడ. ఇక దానికి విద్యారూపము నిచ్చుటయే సహజ శిశువికాసమునకు దోహదమిచ్చుట. ఆ ప్రయత్నముచేసి ఆటపద్ధతిని

ప్రపంచమునకు ప్రసాదించినవాడు 'ఫ్రోబెల్'. అతని పద్ధతికి 'కిండర్ గార్టెన్ పద్ధతి' యని పేరు. పిల్లలతోటయని దీని యర్థము. మాలి మొక్కలను శ్రద్ధతో పెంచునట్లు, ఆటలతో కలకలలాడు పిల్లల నుపాధ్యాయుడు విద్యాబుద్ధులు చెప్పి పెద్ద చేయవలెనని ఈయన ఆశయము. ఈయన శ్రమపడి ఎంతో సామగ్రిని సిద్ధముచేసి, దాని నుపయోగించి విద్యా బోధన చేయుట విపులముగ వివరించెను.

ఇతని పద్ధతి యంతకును మూలము క్రీడ. పిల్లలకు క్రీడ సహజమే యైనను, దానికెట్టి రూపమును లేదు. పరిసరముల ప్రభావమున శిశువెప్పటికప్పు డాటను కల్పించుకొనును. శిశువులో క్రీడవలె అనుకరణ సూచనలుకూడ ప్రబలముగా నుండును. ఉపాధ్యాయుడు శిశువు పరిసరములలో విద్యాకు సుముఖమైన విశేషములు కల్పించిన, శిశువు అనుకరణ సూచనల ప్రభావమున వానిని క్రీడగా గ్రహించును. ఈవిధముగా శిశువుయొక్క క్రీడకు విద్యారూప మీయవచ్చును.

సిద్ధాంతము సులభమైనను, నాచరణలో నాటపద్ధతి యుపాధ్యాయునకు కష్టము. అతి చంచలమైన శిశువుయొక్క ఆటపాటలను విద్యాపరముగ సంస్కరించుటకు ప్రజ్ఞ, సంస్కారము కావలెను. వీనికి మించి సానుభూతి, యనుభవము కావలెను.

భాషా బోధనలో తొలుదొలుత పఠన లేఖనములు నేర్పుటలో నాటపద్ధతికి ప్రముఖ స్థానమున్నది. విద్యాసంస్థల నియమముల నెరుగని పిల్లల నాటపాటలతో నాకర్షించిన

యెడల, బడియందు ప్రేమాభిమానములు వారికేర్పడును. లేనియెడల విద్యయందు విముఖత కలిగి, శాశ్వత నష్టమును పొందుదురు.

— పరిశీలనాంశములు —

(1) ఆట పద్ధతియందిమిడియున్న మానసిక సూత్రములను వివరింపుడు.

(2) భాషాబోధనలో నాటపద్ధతియొక్క ప్రాముఖ్యమును తెలుపుడు.

# 21. (ఆ) మాంటిసూరిపద్ధతి

శ్రీమతి మాంటిసూరి వృత్తిచే వైద్యురాలు. తలిదండ్రులకు సంఘమునకు భారమైన యెడ్డెవారి(మిక్కిలి మందబుద్ధులు)కి తెరవుచూపుటకీమె ప్రయత్నించి సఫలురాలైనది. ఆపద్ధతినే సామాన్యశిశువులకు ప్రయోగించిన చాల లాభదాయకమని గ్రహించినది. ఆమెపద్ధతి కామె పేరే పెట్టి విద్యాప్రపంచ మామెను సన్మానించినది.

ఈమె విద్యావిధానమునకు మూలము పిల్లలస్వేచ్ఛ, క్రమబద్ధమైన ఇంద్రియశిక్షణ. మందబుద్ధులకు తమ యవయవముల వినియోగముకూడ, వారిస్వాధీనములో నుండదు. జీవితములో సాగుపనుల కనుకూలముగ కాలుసేతులను కదపుకొను నాడీమండలపు సమన్వయముకూడ వారిలోలేదు. తమదుస్తులను తాము తొడుగుకొనుట కూడ వారిచేతకాదు.

సామాన్య బాలురకు సామాన్య జీవిత విధుల నెవ్వరును నేర్పరు; అనుకరణవలన వారే గ్రహింతురు. శ్రద్ధతో పరిశీలించినచో, మొదట నేపని నైనను నేర్చునపుడు పిల్లలనేక అభ్యాస ప్రియత్నములు చేయుదురు. మందబుద్ధులకే పని కెట్టి యభ్యాసము చేయవలెనో కూడ తెలియక యూరకుందురు. మాంటెసూరి ఈవిషయమును గ్రహించి వారిమార్గము సుగమము చేసినది. జీవిత విధుల నన్నిటిని వ్యాకరించి, ప్రతిపనికి అనుకూలమైన సామగ్రిని సిద్ధముచేసినది. ఆ సామగ్రిపై మందబుద్ధు లభ్యాసముచేయుదురు. ఆ యభ్యాసము నకుకూడ నిర్బంధము లేదు. చుట్టుప్రక్కలనున్న పిల్లల ననుకరించుటవలన వారే చేయుదురు.

ఉదాహరణకై దుస్తులకు బొత్తాములు పెట్టుకొనుట గ్రహింపుడు. మందబుద్ధులిది తమంతటతాము గ్రహింపలేరు. ఈ పనినేర్పుటకై ఒక చట్రమున కిరుప్రక్కల వస్త్రముంచి, వానికి బొత్తాములు విప్పుచు పెట్టుట ఏర్పరచినది. ఈయొక్క పనిని క్లిష్టమైన వస్త్రధారణ వ్యాపారమునుండి వేరుచేయుట వలన మందబుద్ధుల కభ్యసించుటకు సాధ్యమైనది.

ఈ విధముగా నొకపని మొదలుపెట్టిన పిల్లలాపని తమకు పూర్తిగ స్వాధీనమగువరకు వదలరు; అది శిశు స్వభావము. అందువలన వివిధశిశువులు, వివిధవ్యాపారములలో లగ్నమై ఒకేచోటనుందురు. అదివారికి పరులను పరిశీలించి, గ్రహింపదగిన యంశముల ననుకరించుటకు సహకరించునే

కాని, హానికరముకాదు. అందువలన మాంటిసూరి పద్ధతిలో, ముఖ్యముగ, చిన్న వయస్సులో, తరగతి విభాగములేదు.

పిల్లల ఇంద్రియ శిక్షణకై ఆమె విపులమైన బోధన సామగ్రిని సిద్ధము చేసినది. 3—8 సంవత్సరముల మధ్యవయస్సు వారికీ పద్ధతి చాల ఉపయోగించును. మందబుద్ధుల కిదితప్ప మరొక విద్యావిధానమే లేదు. దివ్యజ్ఞానసమాజపు మద్రాసు కేంద్రము మన దేశములో మాంటిసూరి విధానవ్యాప్తికై చాల పాటుపడుచున్నారు. అచ్చటనొక శిక్షణకేంద్రమున్నది. బోధనసామగ్రి వాఙ్మయముకూడ వారివద్ద లభించును.

## —• పరిశీలనాంశములు. •—

(1) మాంటెసూరి పద్ధతిలోని మూలసూత్రములను వివరింపుడు.

(2) ఈ పద్ధతిలో శిశుస్వభావములోని యే విశేషములు ప్రాముఖ్యమునకు తేబడినవి ?

---

## (ఇ) వ్యక్తిపద్ధతి, డాల్టన్ పద్ధతి

ప్రాచీన కాలమునుండియు నిర్వాహణ సౌకర్యమునకై తరగతిపద్ధతి యాచరణలోనున్నది. మానసిక శాస్త్రప్రభావము విద్యావిధానముపై ప్రసరించినతరువాత బాలునివ్యక్తిత్వమునకు ప్రాముఖ్యము హెచ్చినది. తరగతి బోధనలోని వివిధలోపములు గ్రహింపబడినవి: ఉపాధ్యాయుని యుపన్యాస

ధోరణి ననుసరింపలేని మందబుద్ధులు వెనుకబడుదురు; చురుకు బుద్ధులు విసుగుచెందుదురు; సామాన్యులుకూడ తమ యభిరుచికి భిన్నమైన బోధనయెడ నిరుత్సాహులగుదురు.

ఐతే, వ్యక్తిపద్ధతియనగా నొకే యొక బాలునికి బోధించుటకాదు. బోధకునిశక్తి సామర్థ్యముల లాభమంతయు తమపిల్లవానికొక్కనికే దక్కవలెనని, ఒకప్పుడు శ్రీమంతులు తమతమ పిల్లల కింటివద్ద విద్యనేర్పించుచుండిరి. కాని, ఈ పద్ధతిలో పిల్లలలో సాంఘిక లక్షణములు లోపించును. అందువలన బాలురవ్యక్తిత్వము పాటింపబడు తరగతి బోధన యుత్తమమైనదని తేలినది.

డాల్టన్ అను పట్టణపు పాఠశాలలోని పరిశోధనల ఫలితముగ నేర్పడిన పద్ధతియగుటవలన నీనామము సార్థకమైనది. దీనిప్రకారము విద్యావ్యాపారమంతయు సాధ్యమైనంతవరకు బాలుర స్వయం కృషివలననే సాధింపబడవలెను.

ప్రతివిషయ ప్రణాళికయు విభాగములుగా జేయుదురు. మాసము, పక్షము, వారము, మొదలగు కాలనియమము పెట్టుకొని. ఆ పరిమితిలో ప్రతివిషయమునందలి విభాగమును బాలురు పూర్తి చేయవలెను.

ఆయా విషయములందలి విభాగముల నభ్యసించుటలో బాలురకు కాలనిర్ణయపట్టిక లేదు: ఏదో విభాగము పూర్తి చేసి, మరొకవిషయమునకు సాగవచ్చును; లేదా ప్రతివిషయమునందును కొంచెము, కొంచె మభ్యసింపవచ్చును. నిఘంటువు, పరామర్శగ్రంథములు, ఉపకరణములు మొదలగునవి

పిల్లలు స్వయముగా నుపయోగించుకొందురు. బాలునకు సందేహమేర్పడినపుడే యుపాధ్యాయుడు సహాయపడును. ఇతనిపరిమేయము సవరణయేకాని బోధనకాదు.

కాలపరిమితి యైనపిమ్మట బాలురు పూర్తిచేసిన విభాగముల నుపాధ్యాయుడు సమగ్రముగ పరిశీలించి వ్యక్తిగతముగ చర్చించును. అవసరమునుబట్టి తరగతియంతతోను ప్రసంగించును.

భాషాబోధనకై ఈ పద్ధతి ప్రాథమికదశలో సాధ్యమే కాదు: పిల్లలు కొంత చదువను, వ్రాయను నేర్చి స్వయముగ నభ్యసింపవలెనుకదా. కనుక మాధ్యమికదశలో ప్రవేశపెట్టి ఉన్నత తరగతులలో విరివిగ నుపయోగింపవచ్చును. 'భాష', అంశమునందలి విషయములను గ్రహించుట సులభమేయైనను, సాహిత్య విశేషముల గ్రహించుటలో నుపాధ్యాయుని సహాయమవసరము. బాలు రాత్మవిశ్వాసముతో, స్వయంకృషివలన జ్ఞానసముపార్జనము చేయుటయే ఈ పద్ధతియందలి విశిష్టత. తరగతి బోధనలో స్పృశింపబడని బాలుర శక్తిసామర్థ్యములు స్వయంకృషిలో నుద్భూతములై వికసించును. రోకటిపాటగ సాగు ఈనాటి పరీక్షల చిలుకపలుకులు చాలవరకడుగంటి, విద్యార్థులలో జ్ఞానకాంక్ష ప్రజ్వలించును. ఐతే, ఈపద్ధతి నిర్వహించుటకు సామగ్రికై వ్యయమెక్కువ; సుశిక్షణపొందిన యుపాధ్యాయులు కావలెను.

## — పరిశీలనాంశములు —

(1) తరగతి బోధనలోని ఏ లోపములు వ్యక్తి పద్ధతిని సూచించినవి ?

(2) ఏకైక విద్యార్థిబోధనకు, తరగతిలోని వ్యక్తిగత బోధనకు గల లాభనష్టముల నెంచుడు.

(3) డాల్టను పద్ధతినివివరించి, ఒకతరగతి కొకమాసమున కాపద్ధతిని భాషలో ప్రణాళికను సిద్ధముచేయుడు.

---

# 22. (అ) కథలు, (ఆ) కథనము, (ఇ) భాషాంతరీకరణము

## (అ) కథలు

ప్రతిభాషయందును, తరతరముల యాదరముబడసి, పిల్లలకు వారసత్వమువలె సంక్రమించు కథలనేకముండును. బాలవాఙ్మయములో వీనిదగ్రస్థానము.

కథలయందలి విషయము మానవజీవితమంత విశాలమైనది. ఆదిమానవులు తమయూహా కతీతమగు అద్భుతాంశములను, ఆనందదాయకమగు కల్పనలను, పిన్నల కనుకరణయోగ్యమగు విషయములను కథలలో నిమిడ్చిరి. అన్నిటియందును జయము సత్యముకే.

సహజాతములను స్పృశించి, ఉద్రేకములను రేపి, కౌతుకమును మొలకెత్తించి. సృజనశక్తులను విప్పార్చు కథ

లన్న పిల్లలు చెవికోసికొందురు. కథలయందు వారి వ్యక్తి లక్ష్యమానందమొక్కటే. ఆనందానుభవమువలన అభిరుచి యేర్పడి, అవధానము సాధింపబడును. కనుకనే విద్యాక్షేత్రమున కథలస్థానము గుర్తించినపిమ్మట అన్నివిషయములందును కథలు వెలసినవి. ఆధునిక సాహిత్యములో కథలకు విశిష్టస్థాన మేర్పడినది.

సంభవవిదూరములగు గాంధర్వకథలు పిల్లలను శూన్యకల్పనవుత్సహించి, కృషిపరాఙ్ముఖులను జేయునని మాంటిసూరిమతము. పరిమితమైన బాలుర వాస్తవికానుభవమును కల్పనరూపమున విస్తరింపజేసి, వారి మానసికవృత్తిమును సువిశాలము చేయునని పలువురు విద్యావేత్తల యభిప్రాయము.

బాలుర పూర్వానుభవమెరిగి, అభిరుచులు పరిశీలించి, వయస్సు గమనించి, ప్రవృత్తులను గ్రహించి, తరుణమును విదితముచేసికొని, విద్యాలక్ష్యమును నిర్ణయించుకొని, భాషా ప్రయోజనమరసి, కథలుచెప్పిన నవి బహుప్రయోజనకారులగుట తథ్యము.

బాల్యమున కల్పన దోహదములును, తొలి యౌవనమున నుద్బోధకములునగు కథలు మానసిక శాస్త్రసమ్మతములు, పురాణగాథాశ్రవణమున శివాజీ హిందూధర్మము నుద్ధరించిన వీరుడైనట్లు విందుము. ఆయావ్యక్తుల ప్రకృతికి మించినశక్తులు కథలిచ్చుననుట విశ్వాసవిదూరమైనను, వాని నుచితరీతిని ప్రపోషించి, శిక్షించి, వికసింపజేయుననుట అతిశయోక్తి కాజాలదు.

## (ఆ) కథనము

గద్యపద్యములందలి సుందరకావ్యభాగములు పిల్లల నాకర్షించును. వానినాత్మీయముచేసికొని, శాశ్వతానంద సాధనము లగునట్లు, పిల్లలు వానిని కంఠస్థము చేయనుత్సహింతురు. కాని, చంచలచిత్తులైన పిన్నవారిలో నీయుత్సాహము పాలపొంగువలె ననతికాలముననే చల్లారును కనుక ఉపాధ్యాయు డట్టితరుణములనరసి, బాలుర నాకర్షించిన కావ్యభాగములను చిత్రములవలె సంకలనములుగ కూర్చుకొనునట్లు ప్రోత్సహించుట సులభము. కావ్యోత్సాహము కలిగినపుడెల్ల పిల్లలు ప్రాతస్నేహితులజేరునట్లు సంకలనముల నాదరించి, పలుమార్లు చదివి, తెలియకుండగనే కంఠస్థము చేయుదురు.

కావ్యఖండములను వల్లించుట పద్ధతి విరుద్ధమని శాబోలు ఆధునికలీయంశమును నిరాదరించు చున్నారు. కాని, నిర్బంధకథనమెంతగర్హనీయమో, స్వచ్ఛందకథనమంత వాంఛనీయము. కనుక ఆయాంతరగతులకు కనీసపరిమితులను మాత్రము సూచించి, కావ్యభాగములను బాలురకే వదలవలెను. అప్పుడొకరితో నొకరు పంతులుపడి బాలురెంతయో వల్లింతురు.

భావయుక్తమైన కథనము బాలురకు ధారాశుద్ధిని ప్రసాదించును. వారిభాషాభాండారము, కళాకాంక్ష పెరుగును. కథనముచేయు కావ్యభాగములందలి భావానుభూతిచే బాలురలో భావోద్దీప్తికరణ మేర్పడును. రమ్యకావ్య

రసానుభవము మానవహృదయములోని పాశవ్యమును సుకు మారపరచి, విద్యావైదగ్ధ్యమునకు వన్నెతెచ్చునని యేకదా సర్వకాలములందును సర్వభాషలవారును విద్యలో సాహిత్య మునకగ్రస్థానమిచ్చిరి.

## (ఇ) భాషాంతరీకరణము

ఈనాటిప్రపంచ మేకప్రపంచము. వైజ్ఞానిక విభూ తిచే మానవులంద రత్యంత సన్నిహితులైరి. కాని, వివిధ భాషల కారణమున వారి పరస్పర వ్యవహార యోగ్యత తగ్గుచున్నది. ఐతే, వివిధభాషలందలి సాహితీసంపదలు మానవ కుటుంబముయొక్క వారసత్వమును సారవంతము చేయుచు న్నవికూడ. ఈనాటి మన భారతీయభాషల పరిస్థితి చూడుడు. ఆంగ్లము ప్రాపులేకుండ ఉన్నతవిద్య నిర్వహించుకొనుట అసాధ్యమని యనుభవజ్ఞులైన విద్యావేత్తల యభిప్రాయము. ఎన్నాళ్లీదాస్యమని మన దేశభక్తుల యావేదన.

పాఠశాలదశలో మాతృభాషలు బోధనసాధనములైనను, తగిన పరామర్శగ్రంథములకై శ్రద్ధాళువులైన యుపా ధ్యాయు లాంగ్లమునే తడవుట తప్పుటలేదు.

ఇట్టిసంధియుగములో భాషాంతరీకరణము తప్పని మార్గము. ఫ్రెంచి, జెర్మన్, రష్యన్ వంటి భాషలలో స్వతంత్ర గ్రంథములన్ని శాస్త్రములందును పుంఖానుపుంఖము లుగ వెలువడుచున్నను, ఒకభాష వారింకొక భాషవారి భావభాండారమును భాషాంతరీకరణముచే గ్రహించుచునే

యున్నారు. కనుక ప్రపంచమంతటను పరాయొక్క భాష వ్యవహారములోనికి సచ్చుపదము, (?) ప్రతివాగరక భాషయు భాషాంతరీకరణముపై సాధారపడి యుండకతప్పదు.

ఒకవంక పరభాషీయుల భావసంపత్తిని మనము గ్రహించునట్లు మనభాషలోని భావసంపత్తిని పరులకు పంచుట కూడ మనధర్మమే. తెనుగునందలి యుత్తమ గ్రంథములను పొరుగుభాషలలోనికి, రాష్ట్రభాషలోనికి, ప్రసిద్ధప్రపంచ భాషలలోనికి కూడ యథాశక్తి భాషాంతరీకరించిన గాని, తెనుగుభాషయొక్క ప్రాగల్భ్యము పరులకు తెలియునెట్లు ?

చిన్నవారికి భాషాంతరీకరణము నేర్పుటలో శాబ్దిక మార్గముకన్న భావపథము వాంఛనీయము. చిన్నతరగతులలో పరభాషనుండి మాతృభాషకు, పెద్దతరగతులలో మాతృభాషనుండి పరభాషకు మార్చుట మంచిది.

## పరిశీలనాంశములు

(అ) (1) కథలయంశమునుబట్టి వర్గీకరణము సూచింపుడు.
(2) కథాపద్ధతి యేర్పడుటకు కారణమేమి ?
(3) వివిధ దశలలో భాషాబోధనయందు కథలస్థానము వివరింపుడు.

(ఆ) (1) కథనమువలని భాషాప్రయోజనములేవి ? ఇతర లాభములను కూడ వివరింపుడు.
(2) పిల్లలను కథనమున కుత్సహించు మార్గములను సూచింపుడు.

(ఇ) (1) భాషాంతరీకరణమువలని ప్రయోజనములేవి ?

(2) భాషాంతరీకరణబోధనకై వివిధదశల భేదమెట్లు పాటింపవలెను ?

---

## 23. ప్రణాళికేతర విషయములు

విద్యాభివృద్ధికి ఆటపాటలకు వైరుధ్యము సహజమను నమ్మకము సడలినతరువాత నాటపాటలకు ప్రణాళికేతరవిషయముల రూపమున పాఠశాలలో కొంతగౌరవ మేర్పడినది. కాని, యాధునికులు ప్రణాళికవిషయములు, తదితరములునను విభాగమే యంగీకరింపరు. అఖండముగసాగు శిశుజీవితములో నిట్టి విభాగము హానికరమే.

విద్యయొక్క పరమలక్ష్యము బాలుని మూర్తిత్వము యొక్క సర్వతోముఖ వికాసముకదా. అట్టివికాసమునకు సమతపునాది. ఐతే కొందరుపిల్లలు సహజలజ్జాళువులై యంతర్ప్రవృత్తులుగను, కొందరుద్ధతులై బాహిరప్రవృత్తులుగను రూపొందుదురు. ఆయా ప్రవృత్తులవారు తమతమ ప్రవృత్తికి సుముఖమైన కార్యకలాపములచే నాకర్షింపబడి, ఇతరములకు దూరులగుట సహజము: అంతర్ప్రవృత్తులు ప్రణాళికవిషయముల దెసయు, బాహిరప్రవృత్తులు ప్రణాళికేతరవిషయముల దెసయు నాకర్షింపబడుట సామాన్యము. ఇట్లొకతెగవారు గ్రంథక్రిములై, మరొకతెగవారు వెనుకబెంచీలవారై, తమ తమ మూర్తిత్వములలో విశేషలోపములను ప్రదర్శింతురు.

పిల్లలనాదినుండియు శ్రద్ధతో పరిశీలించి, నేర్పుతో దిద్దిన యెడల ఇట్టిప్రమాదముండదు. భాషాపరమైన ప్రణాళికేతర విషయములలో సంవాదములు, రూపకములు, చర్చలు, ఉపన్యాసములు ముఖ్యమైనవి. ఇవి ఉభయప్రవృత్తుల బాలురను దిద్దుటకు పనికివచ్చును. అంతర్ప్రవృత్తులు వీనిలో పాల్గొని, లజ్జను పోగొట్టుకొని, నలుగురితో కలసిమెలసి యుండుట నేర్చుకొందురు; బాహిరప్రవృత్తులు భాషాపరిచయ మేర్పరచుకొని ప్రణాళికవిషయములలో ప్రావీణ్యము సంపాదింతురు.

## (అ) సంవాదములు

తొలిబాల్యములో నాత్మకేంద్రిత ఎక్కువ. పిల్లల భాషణములో కూడ నీలక్షణ మచ్చుపడియుండును. మలిబాల్యమప్పటి కీలక్షణముమారి బాహ్యానుబంధము పెరుగును. పరస్పరవ్యవహారచిహ్నమైన సంభాషణక్రీడలో ప్రాబల్యము వహించును. బాలురు తమ నిత్యజీవితమునకు, కల్పనకు సంబంధించిన సంవాదముల నుత్సాహముతో నానందింతురు.

## (ఆ) రూపకములు

భాష జీవితముయొక్క సజీవాంగమని రూపకములు స్పష్టపరచును. ఎంతవ్యాఖ్యానించినను అర్థముకాని అనేక భావములు రూపకములలో సులభముగ స్పష్టమగును. భావమున ఛాయామాత్రమున మెలగు వివిధవిషయములకు రూపకములు జీవముపోయును, అనుకరణము, కల్పన మొదలగు

మానసికలక్షణములు ప్రబలముగ నుండుటవలన పిల్లలు రూపకములకై యూవచ్ఛక్తిని ధారపోయుదురు.

బాలురపాఠములనుండి కాని, విస్తృతపఠనమునుండి కాని చైతన్యసాంద్రితగల కథలను గ్రహించి, పిల్లలు తమంతట తామే రూపకము లల్లుకొనుట ఉత్తమపద్ధతి; ఇట్టివానిలో నుపాధ్యాయుని సహాయమత్యల్పముగ నుండవలెను. భాషా సంపత్తి చాలని చిన్నతరగతులలో నిది పొసగదు.

బాలురక్రీడ యాదర్శస్థితి కెన్నడును రాజాలదు: అది వారి సహజవికాసమార్గములో నొకసోపానము. కనుక పిల్లల రూపకములను విమర్శించుటలో తలిదండ్రులు, ఉపాధ్యాయులు నేర్పుతో మెలగవలెను. దీనికన్న బాలుర ఆత్మ విమర్శనము వారికెక్కువ లాభకారి. రూపకములు బాలుర కమితానందమునిచ్చుటయేగాక, వారిభాషను, కళాకాంక్షను, కార్యకుశలతను పెంపొందించును.

## (ఇ) చర్చలు

వీనివలన సమయస్ఫూర్తి, యుక్తియుక్తముగ తమ వాదమును పోషించుకొనుచు నెదుటివారివాదమును ఖండించుట, భావసంయమనముతో చర్చసాగించి, నిష్పాక్షికముగ సత్యాన్వేషణము చేయుట, భాషను చింతనోపకరణముగ వినియోగించుకొనుట మొదలగు అనంతలాభములుండును.

ప్రజాస్వామ్యవ్యవస్థగల దేశములలో పాఠశాలలందలి చర్చసభలను "లోకసభా" పద్ధతిని నిర్వహింతురు. దీనివలన

పిల్లలకు శాసనసభావిధానము లలవడుటయేకాక, తమ క్రీడ కొక గౌరవప్రదమైన లక్షణలక్ష్యము లేర్పడును.

## (ఈ) ఉపన్యాసములు

ఇవి ఒకవిధమైన ఏకపాత్రిచర్చలు. శ్రోతల మెప్పు కోరునట్టి యుపన్యాసకుడు వివిధమతాభిప్రాయములను వివరించి, సహేతుకముగ ఖండించి, తనమతమును స్థాపించుకొనవలెను.

ఇట్టి కార్యకలాపములలో నిమగ్నులైన పిల్లలు వివిధ విషయములను గురించి వివరము లన్వేషింతురు; ఉద్గ్రంథముల సంప్రతింతురు; నాయకుల యభిప్రాయములను గమనింతురు; వాస్తవికజీవితములోని సంఘర్షసామరస్యముల తత్త్వ మరయుదురు. శాస్త్రాభ్యాసనమునకును, విషయజిజ్ఞాసకును రెండును దోహదములగును. లజ్జాళువులు సాంఘికసౌలభ్య మలవరచుకొందురు; దంభులు నమ్రతలోని మాధుర్యమును గ్రోలుదురు.

## —• పరిశీలనాంశములు •—

(1) విద్యావిధానములో పఠ్యాళికేతర విషయముల స్థానమెట్టిది ?

(2) సంవాదముల మానసిక తత్త్వము, భాషాపరమైన లాభము వివరింపుడు.

(3) రూపకీకరణము బాలుర నెట్లాకర్షించును ? వారి యుత్సాహమును భాషాపరముగ సద్వినియోగము చేయుటెట్లు?

(4) చర్చలలో బాలుర కెట్టిశిక్షణ కలుగును ?
(5) "లోక సభా" పద్ధతి ననుసరించి సాగిన మూడు వివరములనిండు.
(6) మంచి యుపన్యాసమిచ్చుటకు పిల్లలకెట్టి సంసిద్ధత కావలెను? దానిలో నుపాధ్యాయుడెట్టి సహాయము చేయవలెను?

---

# 24. శేషాంశములు

## 1. ఒరవడి

హైదరాబాదు రాజ్యములో ఒరవడిని కరడాలందురు. లేఖనము నభ్యసించుటకై తొలి దశలో పిల్లలు ఒరవడి దిద్దుదురు. దీనివలన అక్షరముల స్వరూపము, వానిని వ్రాయు విధము, వ్రాతలో రమ్యత లభించును. దీనివలన లేఖనమందలి యాంత్రిక భాగమే స్వాధీన మగును.

## 2. చూచివ్రాత

దీనివలన లేఖనలోని యాంత్రిక సౌలభ్యముతో కొన్ని భాషా విశేషములు కూడ లభించును. లేఖనములో వేగము, శబ్దముల మధ్య అంతరము, వర్ణక్రమము, విరామచిహ్నముల వినియోగము, లిఖితాంశ భావము కూడ యలవడును.

క్షుణ్ణపఠన జరిగిన పాఠభాగములను, చూచివ్రాతకు గ్రహించిన యెడల భాషాపరమైనలాభములు కలుగు అవకాశ

మెక్కువ. బాల్యమునాటిపొరపడియే ప్రాయమునాటి పాండిత్య మను మాట భాషయందును బ్రతుకు నందునుకూడ పాటింప దగినదనియెరిగి, ఒరవడియందును, చూచివ్రాతయందును, చేతి పొందికనుండి బొమలు చిత్రింపువరకు చక్కగసరిదిద్దవలెను.

## 3. వర్ణక్రమము

మన భాషలోని లిపి ప్రణాళిక పలుకుబడికి సరిసమాన మగుట వలన వర్ణక్రమమున కుచ్చారణము పునాదియని గ్రహింపవలెను. నిర్దుష్టమైన పలుకుబడికి లిపి చిహ్నముల జత పరచిన నిర్దోషమైన వర్ణక్రమ మేర్పడును.

## 4. ఉక్తలేఖనము

ఉక్తలేఖనము వర్ణక్రమమును సుష్ఠుపరచునని సామా న్యభావము. నిజమునకది వర్ణక్రమమును పరీక్షించునే కాని, బలపరుపదు. ఐతే ముందుగా పాఠనిర్ణయము చేసిన యెడల విద్యార్థులు సంసిద్ధులగుదురు కనుక నాలాభము కలుగును. ఇది యుచితమే.

ఉక్తలేఖనమునకు శబ్దములనిచ్చుట పరిమిత లాభము గల ఖండపద్ధతి; వాక్యపరంపర నిచ్చుట వాక్య ప్రణాళిక, భావము, విరామములు మొదలగు భాషా విశేషముల కుపక రించు పూర్ణ పద్ధతి. అక్కరను బట్టి యుపాధ్యాయుడు రెండిం టిని వాడుట లెస్స.

## 5. విరామ చిహ్నములు

అన్ని భాషా విశేషములవలెనే విరామ చిహ్నములు కూడ వాచిక కృషియను పాదులోనే పుట్టిపెరుగును. భావ

స్పష్టతకై పలుకుబడిలో సహజముగ పాటించు విరామము లను సూచించుటకై వ్రాతలో విరామ చిహ్నములుపయో గింతుము. వీనిలో ముందుగా వాక్యాంతబిందువు, ప్రశ్నార్థక చిహ్నము నేర్పుట సులభము. పిమ్మట ఆశ్చర్యార్థక చిహ్నము, కోలను, సెమికోలను, కామా వచ్చును. ఉక్తలేఖ నమునందును, చూచివ్రాతలోను, రచనలోను వీనిని బోధిం చుట సులభము. మన ప్రాచీన సంప్రదాయములో నీ సౌక ర్యము లేదు. ఇప్పటికిని ప్రత్యక్ష సంభాషణమును గుర్తించుట మనలో తక్కువ.

## 6. నిఘంటు వినియోగము

భాషాభ్యసనములో శబ్దార్థ జ్ఞానము ముఖ్యమైనది. చిన్నతరగతులలో నుపాధ్యాయుడే పిల్లల నిఘంటువు. మాన వఠనారంభముతో నిఘంటు వినియోగమున కక్కర కలు గును. వాక్య పద్ధతిని చదువనేర్చిన బాలురకు వర్ణమాల క్రమముతో పరిచయముండదు. నిఘంటు వినియోగమునకది కావలెను కనుక, నిఘంటు వినియోగమునకుముందు వర్ణమాల లోని క్రమము బోధింపవలెను.

నిఘంటు వినియోగములో వేగము ప్రధానము. లేని యెడల అభిరుచికరముగ సాగు పఠనమున కంతరాయ మేర్ప డును. నిఘంటువునుండి సన్నివేశార్థమెరుగుట ప్రధానము; నానార్థము లెరుగుట వాంఛనీయము; వ్యుత్పత్త్యర్థము, వ్యాక రణ విశేషములు, ప్రయోగ దక్షత తెలిసికొనుట పండిత విధానము. మన భాషలో నిన్నియు బోధించు నిఘంటువు

## పరిశీలనాంశములు.

(1) ఒరవడిచూచి వ్రాతల లక్ష్యము లెట్లు భిన్నములు? ఆ లక్ష్యములనెట్లు సాధింతురు?

(2) ఒరవడికెట్టి భాషాసామగ్రి యనుకూలమైనది?

(3) మనభాషలో వర్ణక్రమబోధన నెట్లు సాగింపవలెను? ఏతరగతి దీనికర్హమైనది?

(4) ఉక్తలేఖనమువలన పిల్లల కేయేలాభము లుండును?

(5) విరామచిహ్నములకును, వాచిక కృషికిని గల సంబంధమును వివరింపుడు.

(6) నిఘంటు వినియోగబోధన కుచిత తరుణమేది? దాని నెట్లు బోధింపవలెను?

(7) బాలశిక్షబోధనలో చిత్రములస్థానమును వివరింపుడు.

# 25. ఆంధ్రోపాధ్యాయుడు

పరదేశముల ప్రముఖపండితుల నాశ్చర్యచకితులను జేసినభారతీయ పాండితీపటిమ యడుగంటినది. దాని మను గడ కాధారమైన సాంఘికవ్యవస్థ, సంప్రదాయముకూడ మారినవి, శరవేగముతో మారుచున్నవి. జాతికి జీవగఱ్ఱయైన భాషనుకూడ నీ నష్టగాథనుండి యుద్ధరించుకొన లేకపోతిమి. ఈ విషాదకథయంతయు నీనాటి మన తెనుగుపండితుని దైన్య స్థితిలో ప్రతిఫలించును. మన తలిదండ్రులకు వాక్కుశుద్ధిచేసిన నాటుపండితులుకూడ యరుదైపోయి, విశ్వవిద్యాలయముల యచ్చున పోతపోసిన పండితులు దిగుచున్నారు. ఐతే ఆక్స్‌ఫర్డ్‌లో నాంగ్లమునకున్న గౌరవమర్యాదలు మన విద్యా సంస్థలలో దేశభాషల తాతయైన సంస్కృతమునకే లేనప్పుడు తెనుగువంటివాని కెట్లుండును?

ఈనాటివార మెట్టిభేషజములు లేకుండ 'ఓనమా'ల నుండియు మాతృభాషలను నేర్వవలసినదే. మనలో విశ్వ విద్యాలయములలో మాతృభాషాస్తన్య మెరుగనివారిపై రెండు గురుతరబాధ్యతలున్నవి: గతపాపము పోవునట్లు యథోచితముగ మాతృభాషలు నేర్చుట, వచ్చెడితరమువారి కాభాషల నేర్చుటకుతగిన యవకాశములు కల్పించుట.

సంఘము, ప్రభుత్వము ఏదో యాకాశము నెత్తిన బెట్టువను నాసలుమాని తెనుగుబోధించు ప్రతి యుపాధ్యా యుడు ఈ సంధియుగమున సాధ్యమైనదంతయు చేయవలెను.

ప్రతి యుపాధ్యాయునకు నాకర్షణీయము, గౌరవనీయము నగు మూర్తిత్వము, మనోజ్ఞమైన వాక్కు, బాలుర యెడ వివేకయుక్తమగు సానుభూతి, విశాల సాంఘిక దృక్పథము, ఆధునికవిజ్ఞాన విశేషముల పరిచయము, మానసిక శాస్త్రజ్ఞానము మొదలగు శుభలక్షణము లుండవలెను.

భాషోపాధ్యాయునకిక భాషాపరమైన సంస్కారము కూడ కావలెనుకదా. భాషాసంప్రీతి, విపులవాఙ్మయసేవ, విమర్శనదక్షత, మాతృభాషయందలి నుడికారపు జ్ఞానము, ఛందోవ్యాకరణాలంకారాది భాషాంగపరిచయము, భాషావికాసము, భాషాభివృద్ధియెడల నభీష్టము, వాంఛనీయములు.

మన భాషాబోధనలో నేయొక్కటియు పరిశోధనల వలన ప్రామాణికముకాలేదు. క్లిష్టమైన మనలిపిలో పఠనలేఖనముల విధానము, పిల్లలవాచకముల కుపయుక్తమగు శబ్దరాశి, పాఠశాలలకు యోగ్యమైన నైమిత్తిక వ్యాకరణము, బాలవాఙ్మయము, సర్వలక్షణ లక్షితమైన నిఘంటువు, తుదకు వ్రాతకు, కూతకుకూడ పనికివచ్చు ప్రామాణికభాష, మొదలగునవన్నియు పరిష్కారమునకై వేచియున్న సమస్యలే. వీనినన్నిటిని నైతికదృక్పథముతో చూచినయెడల మన ధర్మము మనకు సువిదితమే.

## — పరిశీలనాంశములు —

(1) క్రొత్తగ నుపాధ్యాయు నెన్నుకొను నవకాశమున్న యెడల ఏలక్షణములకు ప్రాముఖ్యమిత్తురు?

(2) ఆంధ్రోపాధ్యాయుని కధికముగనుండవలసిన లక్షణము లేవి?

(3) ఈనాటి తెనుగు బోధనలోని సమస్యలేవి? ఒకదానిని వివరించి, మీ పరిష్కారము సూచింపుడు.

---

## 26. సంసిద్ధత.

ఉపాధ్యాయుని సంసిద్ధత సందర్భములో పాఠక్రమ సూచిక అను మాట తరచు వినుచుందుము. ఐతే బోధనాభ్యసన శిక్షణపొందుఉపాధ్యాయునకు, శిక్షణపొంది బోధనలో నిష్ణాతుడైన వానికి చాల భేదముండును. శిక్షణపొంది పాఠశాలలో ప్రవేశించిన తరువాత విశేష బాధ్యతలను కూడ అతడు వహింపవలసి యుండును.

శిక్షణకాలములో పాఠక్రమ సూచికలను, శిక్షణానంతరము పాఠాంశములను సిద్ధముచేసికొనవలెను. పా.క్రి.సూ.— ఇది తరగతి బోధనకు పరిపూర్ణ ప్రతిబింబము. ఉపాధ్యాయుడు బోధించు ప్రతియంశము, దానికి సంబంధించిన ప్రశ్నలు, ప్రదర్శనక్రమము, విధము, చిత్రప్రదర్శనము, మొదలగునవి సర్వము దీనిలో వివరింపబడి యుండును. శ్రద్ధగల యుపాధ్యాయుడు దానిని పూర్తిగ స్వాధీనము చేసికొని, తరగతిలో ప్రదర్శించిన చాలును. పిల్లలకు వచ్చు సందేహములను వారు చేయు పొరపాట్లను మాత్రము ఎప్పటికప్పు డెదుర్కొనవలసి యుండును.

కొందరంశము పద్ధతియని రెండు విభాగములు చేసి, అంశములో పాఠాంశమును వ్రాసి, పద్ధతిలో దానిని బోధించుట కనువగు ప్రశ్నలను వ్రాయుదురు. కొన్నిచోట్ల "ఈయంశము వివరింబడును; ఇది రాబట్టబడును" మొదలగు సూచనలు మాత్రముండును. అంశము, పద్ధతి భిన్నములను భావముపై నీపద్ధతి యాధారపడి యున్నది. కాని, అవిరెండు భిన్నములను భావమే విద్యామానసిక శాస్త్రమంగీకరింపదు. తరగతి యర్హతను బట్టి, యంశమును సంస్కరించిననే గాని, అది ప్రదర్శన యోగ్యము కాదు. ఇక "వివరింపబడును, రాబట్టబడును" అను సూచన లస్పష్టములు. వాని కుచితమైన ప్రశ్నలను, ప్రయోగములను ముందుగ నాలోచించి సిద్ధముగ నుంచుకొనని యెడల, అనుభవములేని యుపాధ్యాయున కేమియు తోచక, ఏదో చేయుటయో, లేక చిత్తరువు వలె నిలబడుటయో జరుగును. కనుక అంశము పద్ధతి కలిపియే సిద్ధము చేసికొనుట యుత్తమము. భాషాపాఠములలో నిది తప్పక చేయవలెను. ప్రత్యుత్తరములను క్లుప్తముగ సూచింపవలెను.

## పాఠాంశములు

శిక్షణపొందిన యుపాధ్యాయునకు పద్ధతి కష్టముకాదు: నేర్పరియగు కళాకారునివలె అతడు సహజముగ నెప్పటికెట్లు కావలెనో అట్లు బోధింపగలిగియుండును. కనుక నతనికి పా. క్ర. సూ. లు సిద్ధముచేయుట కాలయాపనయే. కాని, పాఠాంశములను మాత్రము సిద్ధము చేసికొనవలెను. వీనిలో

పాఠములోని ముఖ్యాంశములు, వానిక్రమము, పరిమితి మొదలగునవి ఉపాధ్యాయుని సౌకర్యమునకై సూచింపబడును. వచనపాఠమైనచో నర్థములు, ప్రయోగమునకు నిర్ణయించిన శబ్దములు, పూర్వగాథలు మొదలగునవి యుండును.

## పాఠగణము

ఒకపీరియడుకాలములో ముగియునది ఒకపాఠము. ప్రణాళిక యందలి ప్రతియొక్క అంశము నొక పాఠములో నిముడదు. పెద్దయంశము ననేకపాఠములుగ చేయవలసి యుండును. అట్టిపాఠములలో నొక పరస్పర సంబంధముండును. కనుక, వానినన్నిటిని ఒకగణముగా భావించుట సహజము.

సంవత్సరము మొదట, కాలెండరు, కాలనిర్ణయపట్టిక యొక్క సహాయముతో సంవత్సరమునకు భాషకువచ్చు పీరియడ్లు నిశ్చయించుకొని, పిమ్మట ఉపాధ్యాయుడు వచనము, పద్యము మొదలగు నొక్కొక్కశాఖ కెన్నిపీరియడ్లేర్పరింపవచ్చునో చూచుకొనవలెను. అప్పుడు పాఠ్యగ్రంథములోని నిర్ణీతపాఠములను తీసికొని, వానిని వివిధశాఖలకేర్పడిన పీరియడ్లలో ముగించునట్లొక విపులప్రణాళికను సిద్ధముచేసికొనవలెను. దానికై ప్రణాళికయందలి ప్రతియొక్క అంశమును పాఠగణములుగా విభజించి, మొత్తము పీరియడ్లకు సరిపడునట్లు చూడవలెను.

పిల్లలతోపని, పైనచూపినంత యాంత్రికముగ సాగదు కదా. కనుక ప్రణాళికవిభాగము మాత్రము సంవత్సరమునకంతకు చేసికొని, పాఠగణముల వివరములు ప్రతిటెరమునకు

చేసికొనుట మంచిది. కాని, పద్ధతి (సూత్రము)లను తెలియక బోధన సాగించుట, మొదటివారికి పెరుగు తరువాతవారికి నీరుపోయు పద్ధతివలె సిద్ధమగును.

## పాఠపథకము

ఇది మానసికశాస్త్రము ననుసరించి, భాషలోని వివిధ శాఖలబోధన కనుకూలమైన సోపానములను సూచించును. బోధనసూత్రములను, పద్ధతులను తెలిసిన ఉపాధ్యాయుడు పాఠపథకమునుబట్టి బోధన సాధించుకొనగలడు.

భాషలో వచనము పునాదివంటిది. కనుక ఉదాహరణకై ఒక వచనపాఠమునకు పూర్తి పాఠక్రమసూచికను చూపి, మిగిలిన ప్రధానశాఖలకు పాఠపథకములను చూపితిని. పాఠగణమును, పాఠభాగమును ఎడమచేతివైపు పుటపై చూపవలెను. ఏనాడు చెప్పబడు పాఠమూ తారీఖున టిక్కుపెట్టి చూపవలెను. పాఠగణములో క్రమసంఖ్య, పాఠముపేరు, తేది, తరగతి, పీరియడు సూచింపబడును. పా. క్ర. సూ. కకు పైన, పాఠము యొక్కయు, తరగతి యొక్కయు, నుపాధ్యాయుని యొక్కయు వివరము లుండును.

---

## పాఠము — మయసభ

| క్ర. సం. | పాఠగణము | తేది | తరగతి | పీరియడు |
|---|---|---|---|---|
| √1. | సభానిర్మాణమున కనుజ్ఞ | 1–8–'54 | 7వ | 1వ |
| 2. | సభవర్ణన | 2–8–'54 | ,, | ,, |
| 3. | దుర్యోధనుని యవమానము | 3–8–'54 | ,, | ,, |

## పాఠభాగము

"మయుఁడొకతూఱి శ్రీకృష్ణ ధర్మజులున్న గోష్ఠికేతెంచి, క్రీడినిదర్శించి, కృతాంజలియై, "ప్రాణరక్షణమహోపకార మొనర్చిన మీకు బ్రియముసేయఁజాలను. అట్లయ్యు యథాశక్తి బ్రత్యుపకారమొనర్ప గడఁగితిని. నేనుదానవవిశ్వకర్మను. బహువిధ శిల్పకళాచతురుఁడను. నీకిష్టమైనకార్యమున నియోగించి, నన్ననృణుని గావింపు" మని విన్నవించెను. శ్రీహరి యలతితడవాలోచించి, "ధర్మజునకు నీయపూర్వకలాకౌశల ముట్టిపడఁ సభామందిరమును నిర్మింపుము" అని యానతిచ్చెను. మయుఁడాయాజ్ఞ ననుగ్రహముగ భావించి నిర్మింపఁదొడఁగెను."

### పా. క్రి. సూ.

1. ఉ. ని పేరు—
2. విషయము— తెనుగు, వచనము.
3. పాఠము—మయసభ—సభానిర్మాణమునకనుజ్ఞ
4. పూర్వజ్ఞానము—భారతకథ
5. విశాలోద్దేశము—భాషాభివృద్ధి, పౌరాణిక వాఙ్మయములో నభిరుచి వృద్ధి.
6. ప్రత్యేకోద్దేశము—మయుఁడు సభానిర్మాణమున కనుజ్ఞ గొనుట; ప్రాచీన హైందవశిల్పమం దాదరాభిమానములు; శబ్దప్రయోగము.
7. ఉపకరణములు—దక్షిణదేశపు దేవాలయముల చిత్రము.

| సోపానములు | అంశపద్ధతులు | నల్లబల్లపని |
|---|---|---|
| ప్రవేశము | (చిత్రప్రదర్శనము) మీరీపటములో ఏమి చూచుచున్నారు ? (దేవాలయములు) ఇట్టివానిని కట్టువారి నేమందుము?(శిల్పులు మన పురాణముల లోని ఒక ప్రసిద్ధశిల్పి పేరు చెప్పుడు. (మయుడు) ఇతడునిర్మించిన గొప్ప కట్టడమేది? (సభ) | |
| ఉద్దేశప్రకటనము | ఈనాడు మనము మయుడు సభానిర్మాణమున కనుజ్ఞ గొను టనుగురించి చదువు కొందము.) | సభానిర్మాణమున కనుజ్ఞ |
| ప్రదర్శనము | | |
| (అ) | ఉ. ని పఠనము— | |
| (ఆ) | విగ్రహము | |
| | కృతాంజలియై | కృతాంజలియై |

| సోపానములు | అంశపద్ధతులు | నల్లబల్లపని |
|---|---|---|
| | కృత + అంజలియై | కృత + అంజలి + ఐ |
| | మహోపకారము | మహోపకారము |
| | మహా + ఉపకారము | మహా + ఉప కారము |
| | ప్రత్యుపకారము | ప్రత్యుపకారము |
| | ప్రతి + ఉపకారము | ప్రతి + ఉపకారము |
| | నన్ననృణుని | నన్ననృణుని |
| | | నన్ను + అనృణుని |
| (३) | అర్థ సంగ్రహణము—ఖాండవదహనము—పూర్వగాథ | |
| | ఇంద్రునోడించి, యర్జును డగ్నిహోత్రుడు ఖాండవము నుదహించుటకు సహాయపడెను; ఆ వనములో జిక్కిన మయుని రక్షించి యతని కృతజ్ఞతకు బాత్రుడయ్యెను. | ఖాండవ దహనము—ఖాండవమను వనమునుకాల్చుట |

| సోపానములు | అంశపద్ధతులు | నల్లబల్లపని |
|---|---|---|
| | గోష్ఠి— రాచకార్యముల నాలోచించుటకు రాజులు మంత్రుల గోష్ఠిసలుపుదురు. | గోష్ఠి—సభ |
| | కృతాంజలి— మర్యాదగల బాలుడు పెద్దలను దర్శించినపుడు కృతాంజలియై నిలబడును. | కృతాంజలియై—నమస్కరించినవాడై |
| | యథాశక్తి మంచివారు పేదవారికి యథాశక్తి సహాయము చేయుదురు. | యథాశక్తి—చేతనైనంతవరకు |
| | చతురుడు తేన్‌సింగ్ పర్వతముల నెక్కుటలో చతురుడు. | చతురుడు—నేర్పరి |
| | అలతి మీ పాఠశాల యిచ్చటికి అలతిదూరములో నున్నది. | అలతి—కొద్ది |

| సోపానములు | అంశపద్ధతులు | నల్లబల్లపని |
|---|---|---|
| | అనృణుడు- | అనృణుడు-<br>ఋణముతీర్చిన వాడు |
| (ఈ) | బాలురమౌనపఠనము | |
| (ఉ) | చర్చ<br>ఈ పాఠమెవరిని గురించి? (మయుని)<br>అతడెవరు? (దానవ విశ్వకర్మ)<br>కథలో నతడెచ్చటికి బోయెను? (ధర్మరాజు సభకు)<br>ఎవరికొరకు? (అర్జునుని కొరకు)<br>ఎందుకు? (అతనికి ప్రత్యుపకారము చేయుటకు)<br>అర్జును డితనికి జేసిన యుపకారమేమి?<br>(ఖాండవదహన సమయమున రక్షించెను) | |

| సోపానములు | అంశపద్ధతులు | నల్లబల్లపత్తి |
| --- | --- | --- |
| | మరియు అర్జునునితో జెప్పినదానిలో ముఖ్యమైనవాక్యమును చదువుము. (నీకిష్టమైన......గావింపుము.) | |
| | మరియునకెవరు ప్రత్యుత్తరమిచ్చిరి? (శ్రీహరి) అర్జునునడుగగా నతడేల ప్రత్యుత్తరమిచ్చెను? (కృష్ణు డర్జునునకు హితుడు) | |
| | మరియు డు తన్ను ప్రశ్నించినపు డర్జును డేమిచేసి యుండును? (కృష్ణునివైపు చూచి యుండును) | |
| | (రూపకీకరణము— నన్నయకృత భారతమునుండి, పాఠభాగము వినిపింపబడును.) | |

| సోపానములు | అంశపద్ధతులు | నల్లబల్లపని |
|---|---|---|
| | కృష్ణుడేమని ప్రత్యుత్తరమిచ్చెను? (సభామందిరమును నిర్మింపుమని) | |
| | దానికి మయుడేమి చేసెను? (అనుగ్రహముగా భావించి, యంగీకరించెను.) | |
| పునర్విమర్శనము— అ— | అంశము— | |
| | ఈ పాఠమునుబట్టి, పాండవుల సభలో కృష్ణుని కెట్టిస్థానముండెనను కొందువు? (చాల గౌరవమైన) | |
| | అతడు పాండవుల కెట్లు సహాయము చేయుచుండెను? (హితవు చెప్పుచు) | |
| | ఈ పాఠమందలి నీతి యేమి? (ఉపకారులకు | |

| సోపానములు | అంశపద్ధతులు | నల్లబల్లపని |
| --- | --- | --- |
| | (ప్రత్యుపకారము చేయవలెను.) | |
| ఆ— | శబ్దప్రయోగము— కృతాంజలి యథాశక్తి చతురుడు. | కృతాంజలి యథాశక్తి చతురుడు |
| ఇ— | బాలుర పఠనము. | |

# పాఠపథకము

## 1. వచనపాఠము

(వెనుకటి పాఠముయొక్క సోపానములను క్రోడీకరించిన వచనపాఠమునకు పాఠపథక మేర్పడును)

1. ఉద్దేశము—
   (అ) విశాల.
   (ఆ) ప్రత్యేక.
2. ప్రవేశము.
3. ఉద్దేశ ప్రకటనము. — శీర్షిక
4. ప్రదర్శనము—

(అ) ఉ. ని పఠనము
(ఆ) విగ్రహము.
(ఇ) అర్థ సంగ్రహణము.
(ఈ) బాలుర మానపఠనము.
(ఉ) చర్చ.

5. పునర్విమర్శనము—
(అ) అంశము.
(ఆ) శబ్దప్రయోగము.
(ఇ) బాలుర పఠనము.

## 2. పద్యపాఠము

1. ఉద్దేశము—అ_ఆ.
2. ప్రవేశము—
3. ఉద్దేశ ప్రకటనము—
4. ప్రదర్శనము—
(అ) ఉ. ని పఠనము.
(ఆ) స్థూలార్థ సంగ్రహణము.
(ఇ) విగ్రహము.
(ఈ) అర్థ సంగ్రహణము.
(ఉ) ప్రకట పఠనము.
(ఊ) చర్చ.

5. పునర్విమర్శనము.

(అ) అంశకము.

(ఆ) బాలుర పఠనము.

## 3. వ్యాకరణపాఠము

1. ఉద్దేశము—(అ)–(ఆ)
2. పరివేశము.
3. ప్రదర్శనము.

(అ) పరిశీలనము.

(ఆ) సూత్రమును రాబట్టుట.

(ఇ) అభ్యాసము.

4. పునర్విమర్శనము—సూత్రప్రయోగము.

## 4. రచనపాఠము

1. ఉద్దేశము—అ–ఆ.
2. ప్రవేశము—
3. ప్రదర్శనము—

(అ) అంశ సంగ్రహణము.

(ఆ) అంశవర్గీకరణము.

(ఇ) వాచికకృషి, లేక లేఖనము.

(4) పునర్విమర్శనము—యథోచితము.

# ౨౭. పరిభాష

అంతర్ప్రవృత్తులు—Introverts
అక్షరపద్ధతి—Alphabetical method
ఉక్తలేఖనము—Dictation
ఉద్దీపనశక్తి—Evocative power
విద్దెశిశువు—Subnormal child
కథనము—Recitation
క్లుప్తరచన—Abridgement
కారకదశ—Active stage
కారకాంశము—Active aspect
చర్చ—Debate
దృక్పద్ధతి—Look-and-say method
నైమిత్తికవ్యాకరణము—Functional grammar
ప్రకటపఠనము—Loud reading
ప్రణాళికేతర విషయములు—Extra curricular activities
ప్రతిష్ఠాపనపద్ధతి—Inductive method
ప్రయోగక్రమసూత్రము—Principle of frequency
ప్రయోగపద్ధతి—Deductive method
ప్రయోగవ్యాకరణము—Formal grammar
ప్రయోజనము—Value
ప్రామాణికభాష—Standard language
బాహిరప్రవృత్తులు—Extroverts
భాష—Language (V. Literature)
భాషానైపుణ్యము—Linguistic skill
భాషాయుగము—Linguistic epoch
మౌనపఠనము—Silent reading
లక్ష్యములు—Aims

వాక్యపద్ధతి—Sentence method
వాచికకృషి—Oral work
విశ్లేషపద్ధతి—Analytical method
విషయము—Snbject
శబ్దపద్ధతి—Word method
సంకలనము—Anthology
సంవాదము—Dialogue
సంశ్లేషపద్ధతి—Synthetic method
సమత—Balance
సాంకేతికశక్తి—Symboloic power
స్తబ్ధదశ—Passive stage
స్తబ్ధాంశము—Passive aspect
పాఠము—Lesson
పాఠగణము—Scheme of lessons
పాఠక్రమసూచిక—Notes of lesson
పాఠాంశము—Teaching notes
పాఠపథకము—Lesson form

---

# సవరణ

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 19 | వచ్చినది | వచ్చినవి |
| 72 | 13 | వైరుధ్యము | వైవిధ్యము |